


## నూతన శాసనసభలు–సభ్యురాండ్రు

'వందేమాతరం' అని సుశ్రావ్యకంఠముతో, దేశభక్తిపూరితహృదయముతో, శాసనసభ్యురాలగు శ్రీమతి లక్ష్మీశంకరయ్యరుగారి ప్రార్థన, నూతనసంస్కరణముల ప్రకారము సమావేశమైన అసెంబ్లీ సభయందు మారుమ్రోగినది. ఇది భారతదేశ శాసనసభల చరిత్రయందెంత యపూర్వమైనదో యంతటి శుభకరమైనది. ఇదివఱకు భారతదేశ కేంద్రప్రభుత్వమునందుగాని రాష్ట్రములందుగాని యేర్పడిన శాసనసభలందిట్టి ప్రారంభము కనివిని యెఱుగము. అదియునుగాక ఇంతకుమునుపు శాసనసభల ప్రవేశించినవారందరు ఇప్పటివలె అధిక జనసామాన్యముచే నెన్నుకొనబడినవారు కారు. శాసనసభలకే కొద్దిమందిచేతనో ఎన్నుకొనబడువఱకు భారతదేశము, భారతీయులు, వారి పరిస్థితులు జ్ఞాపకముండెనేమో కాని తరువాత వారికా సంగతులు స్మృతిపథమున లేవు. తరువాత వారి ధోరణియే వేరు. తాము కోట్లకొలది భారతీయుల ప్రతినిధులమను మాటయే వారు దలంపలేదు. ఆవిషయమే వారికి జ్ఞాపకముండియున్నచో దేశీయులు బాగుపడుటకు వారెంతేనియు చేసియుందురు.

ఇప్పటి శాసనసభలస్థితి వేరు. జూలై 15వ తేది యీ రాష్ట్రపు రాజకీయముములలో మదరాసు శాసనసభల చరిత్రలో నూతన శకారంభదినము. భారతీయుల యాశయములకు దూరములై యున్న నూతనసంస్కరణములను భగ్నము చేయు

టకే వానియందు పాల్గొనవలయుననెడి యుద్దేశ్యముతో, భారతమాతకు కవచప్రాయమైన ఖద్దరువస్త్రధారణముతో, అధ్యక్షపదవి నధిరోహించినవారుకూడ కొట్లకొలది భారతీయుల పరిస్థితుల ప్రదర్శించు ప్రతినిధివోలె దోపింపచేయు వేషభాషలతో, పైపెచ్చుగ మాతృదేశసంకీర్తనముతో ప్రారంభింపబడిన యీ శాసనసభల ప్రథమసమావేశము శుభోదయమునకు పునాది.

ఈ శాసనసభలందు మొత్తము తొమ్మండుగురు సభ్యురాండ్రు గలరు. వీరందరు ఎన్నికలందు విజయముబడసి శాసనసభార్హత సంపాదించినపుడే 'గృహలక్ష్మి' వీరి నభినందించి యందరి సోదరీమణుల పక్షమున వారి విజయమును ప్రశంసించియుండెను. ఇపుడు వీరందరు అధిక సంఖ్యాకుల అభిప్రాయము ననుసరించి పదవు లంగీకరించియే దేశోద్ధరణకు పాటుపడనగునని ప్రయత్నించియున్నారు. కావున మహిళాజనప్రతినిధులగువారు తమ సోదరీమణుల విషయమున నేమి చేయనగునో 'గృహలక్ష్మి' సూచింప నిచ్ఛగించుచున్నది. ఇవన్నియు వారికిమాత్రము నూతనము గాదు.

ఇప్పటి దేశపరిస్థితులనుబట్టి స్త్రీ పురుష వ్యవస్థలేకుండ నందరేకీభవించి దేశాభివృద్ధికి కావలసిన సమస్యలనెల్ల పరిష్కరింపవలయుననియే మేము కోరుచుందుము. అటులయ్యు స్త్రీసభ్యురాండ్రు ప్రత్యేకముగా కృషిచేయవలసిన యావశ్యకత లేకపోలేదు. తమ సోదరీమణు లీ విధమున త్వరగా నభివృద్ధికివచ్చు మార్గములు వారి కత్యంతావశ్యకముగా నేడు కావలసిన సదుపాయము లెవ్వియో పురుషులకంటె స్త్రీలు సులభముగ గ్రహించుకొనిగలరు. ఆవిధమున చేయవలసిన కార్యక్రమమును గుర్తించి సాధనోపాయముల శాసనసభలందు ప్రవేశపెట్టి పురుషులదృష్టిని వానివైపు మరలింపనగును.

మొదట వారు గమనింపవలసినది నేటి విద్యావిధానము. ఇయ్యది స్త్రీపురుషుల కెంత నిరుపయోగమైయున్నదో యందరెరిగినదే; అందరు నిరసించునదే. కాని సంస్కరణోపాయములు చాల తక్కువ. కావున స్త్రీలకు ముఖ్యముగా గావలసిన విద్యావిధానము అమలునందుంచుటకు స్త్రీసభ్యురాండ్రు కృషిచేయవలయును. ఈ దృష్టితో నిదివఱకు కొన్నిచోటులందు ప్రారంభింపబడిన విద్యావిధానమును, సంస్థలను నభివృద్ధికిదెచ్చు మార్గమునకై వారు పాటుబడవలయును.

సంఘమునందు స్త్రీల యభివృద్ధి కాటంకములై పక్షపాతదృష్టితో చలామణియగుచున్న ఆచారముల నన్నింటిని న్యాయదృష్టితో సంస్కరింప పూనుకొనవలయును. మూలసూత్రముల మూలకునెట్టి కేవలము వాడుకలరూపమున నిల్చి స్త్రీ అభ్యుద

యను నరికట్టుచుండు వానినికూడ గమనించి నివారింప ప్రయత్నించవలయును. అంతియగాక నింతవఱకు సాంఘికాభివృద్ధిని గోరి నిర్మింపబడిన చట్టములందలి లోపములను దొలగించి చట్టములన్నియు పుస్తకములకుగాక సంఘమున కుపయోగపడురీతి శ్రద్ధ వహింపవలయును.

తదుపరి స్త్రీల కార్థికముగా తగిన సదుపాయముల గలిగించుటకు తగినకృషి చేయవలయును. వారి యార్థికపరిస్థితుల బాగుచేయు నుద్దేశ్యముతో చేయబడిన చట్టములు తృప్తికరముగలేని సంగతి సోదరీమణులకు విదితమే. వీనితోగూడ స్త్రీలు, శిశువులు, వీరి యారోగ్యాభివృద్ధికి కావలసిన యేర్పాటులు, వారికి నే డత్యావసరముగ గావలసియున్న వైద్యసాహాయ్యము, కలిగించుటకు ప్రయత్నింపవలయును.

సంఘమునందు స్త్రీల యున్నతికి గావలసినవానిని గుర్తించి తత్సంబంధమగు నేర్పాటుల చేయుట ప్రవేశపెట్టిన విషయములను పురుషులు నిష్పక్షపాతదృష్టితో విమర్శించి యవి ఫలించుటకు తమ యధికారముల నుపయోగించి స్త్రీలకు తోడ్పడవలయును.



## మాతృవందనము

"ఉభయభాషాప్రవీణ"
జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు

సీ॥ తెనుగుకబ్బము చక్కదనము చూపిన పోతనామాత్యుగన్న రత్నాలతల్లి!
తెనుగుకత్తుల వాడిదనము చాటిన వెల్మవీరులగన్న బంగారుతల్లి!
తెనుగు తేజము చిక్కదనము దేర్చిన కృష్ణరాయలగన్న వరాలతల్లి!
తెనుగుపాటల తియ్యదనము చిల్కిన త్యాగరాజునుగన్న వజ్రాలతల్లి!
తెనుగు రక్తానగల గొప్పదనము దెలుపు
కవుల వీరుల రాజుల గాయకులను
గన్నమాతల్లి! చల్లనికడుపు తల్లి!
తెనుగుతల్లీ! జోహారు గైకొనుముతల్లి!

# మదరాసు కాంగ్రెసు మంత్రిమండలి

| మంత్రులు | శాఖలు | మంత్రుల కార్యదర్శులు |
|---|---|---|
| 1. సి. రాజగోపాలాచారి<br>ప్రధానమంత్రి | పబ్లికుహోము,<br>పోలీసు, సి.ఐ.డి, జైళ్లు | అయ్యదేవర కాళేశ్వరరావు<br>బి.యే., బి.యల్., బెజవాడ |
| 2. టంగుటూరి ప్రకాశం<br>(బారిష్టరు) మద్రాసు | రెవిన్యూశాఖ | తెన్నేటి విశ్వనాథం<br>యం.ఏ, బి.యల్., విశాఖపట్టణం |
| 3. వి. వి. గిరి<br>(బారిష్టరు) | లేబరు, ఇండస్ట్రీసుశాఖలు | బయ్యా సూర్యనారాయణమూర్తి<br>బి.యే., బి.యల్. (హరిజన) కాకినాడ |
| 4. బెజవాడ గోపాలరెడ్డి<br>నెల్లూరు(విశ్వభారతిశాంతినికేతనం బి.ఏ.) | స్థానికపరిపాలన | ఎమ్. భక్తవత్సలం మొదలియార్<br>బి.యే., బి.యల్. ఉత్తరఆర్కాటు |
| 5. డాక్టరు పి. సుబ్బరాయన్<br>యం.ఏ., డి. సి ఎల్. (బారిష్టరు) సేలము | విద్యా, న్యాయశాఖ | ప్రొఫెసరు సి. ఏ. వార్కీ<br>యం. ఏ. (క్రిస్టియన్) మంగుళూరు |
| 6. యస్. రామనాథపిళ్లె<br>యం.ఏ., బి.యల్. (తంజావూరు) | పబ్లిక్ ఇన్ఫర్మేషన్ | మాగంటి బాపినీడు<br>యం. యస్సి., ఏలూరు |
| 7. కె. రాముని మీనన్<br>బి.యే., బి.యల్. (మలబారు) | కోర్టులు, వగైరా | మోహిద్దీన్ మార్కాయర్<br>వర్తకుడు—తంజావూరు |
| 8. డాక్టరు టి.యస్.యస్.రాజన్<br>(సుప్రసిద్ధవైద్యులు, తిరుచునాపల్లి) | ఆరోగ్యశాఖ | ఎ. బి. శెట్టి<br>డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటు, దక్షిణకనరా |
| 9. యాకూబ్ హాసన్ సేట్<br>(మహమ్మదీయుడు వర్తకుడు) | పబ్లిక్ వర్క్సు | కె. ఆర్. కరంతు<br>బి.యే., బి.ఎల్., మంగుళూరు |
| 10. వి. ఐ. మునిస్వామిపిళ్లె<br>(హరిజననాయకుడు) నీలగిరి | అభివృద్ధి,వ్యవసాయశాఖలు | యన్. యస్. వరదాచారి<br>యం.ఏ., బి.యల్., తిరుపతి |



మిసర్స్. విజయలక్ష్మీ పండిట్
శ్రీయుత జవహరిలాల్ నెహ్రూగారి సోదరి.
మంత్రిపదవిని పొందిన ప్రథమ భారతనారీమణి.



శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు
అసెంబ్లీ ఉపాధ్యక్షురాలు.
చెన్నపురి స్త్రీలస్థానమునుండి అసెంబ్లీకి ఎన్నుకొనబడిరి.

# మనసులో మాటలు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

## మహిళాపతాక

భారతదేశములో మహిళోద్యమము ఆరంభమై దాదాపు ఒక్క పుష్కరమైనది. ఈ పది రెండేండ్ల కృషివల్లను భారతమహిళామణులు తమ ఆశయములను ప్రభుత్వదృష్టికిని ప్రజాదృష్టికిని తేగలిగినారు. ప్రపంచములోని అంతర్జాతీయ మహిళాసంఘములతోను దేశమునందలి పల్లీపట్టణములతోను సంబంధము కలిగించుకొనినారు. జాతిమతవర్ణ వివక్షత లేక ప్రజాహృదయము చూరగొన్న భారతజాతీయోద్యమములలో కాంగ్రెసు తరువాత మహిళోద్యమమే గణనీయమైనది.

భారతదేశమునందలి పదునెన్మిదికోట్ల స్త్రీల పక్షమున నీయుద్యమము పనిచేయుచున్నది. యుగయుగములుగ వ్యక్తిత్వము లేక కేవలము జడయంత్రములుగ పరిగణింపబడు భారతనారీమణులకీ యుద్యమము మూలముగా నవజీవము గలిగినది. రాజకీయములలో పాల్గొను కుతూహలమును, సాంఘిక విషయములలో పరివర్తనము కలిగించుకొనవలయునను నభిలాషయు, విద్యావిషయములో పరిపూర్ణత పొందవలయునను నౌత్సుక్యమును ఆర్థికములో నుపపత్తిని బడయవలయునను పట్టుదలయు, పురుషులతో సమానస్వాతంత్ర్యము నందవలయునను నపేక్షయు నధికమైనవి. ఈ ఆశయములు సాఫల్యమొనర్చుకొనుటకే భారతమహిళామణులు ప్రతివత్సరము తాలూకాసభలను, జిల్లాసభలను, రాష్ట్రసభలను, దేశసభలను జరిపి తమ సందేశముల మూలమూలల వ్యాపింపజేయుచున్నారు.

నేడీ విశాలభారత దేశములో నలువైపుల బారచూచినచో స్త్రీ ప్రాతినిధ్యము లేని సంఘముగాని సంస్థగాని కనుపించుటలేదు. కాన మహిళోద్యమేయుద్దేశములో ప్రారంభింపబడినదో యాయుద్దేశము సఫలమగుచున్నదనియే చెప్పవచ్చును.

అయితే ఈ మహిళోద్యమ మింత విశాలమై యావద్భారతదేశవ్యాప్తిగాంచినను దీనికొకపతాక చిహ్నముమాత్ర మింతవఱకేర్పడలేదు. దేశములో యేకొలదిమందికి మాత్రమే చెందిన కర్షకకార్మిక సంస్థలును, జాతిమత శాఖాసంఘములును, తమతమ ఉద్యమముల కనుకూలమైన చిహ్నములేర్పరచుకొని యూరేగింపులలో నుత్సవములలో సభాసమావేశములలో వానికి ప్రత్యేకోత్సవములను జరిపి ప్రజాప్రబోధము గలిగించుట పరిపాటైనది. కాని మహిళోద్యమముమాత్ర మీవిషయము నింతవఱకు గమనించలేదు.

మహిళోద్యమ మింకను యావద్భారతనారీయాకర్షితము కావలయునన్నచో నొకపతాకచిహ్న ముండుటత్యంతావశ్యకమైయున్నది.

ఈ దేశమునందు స్త్రీలచే నడుపబడు సమాజములేమి పాఠశాలలేమి పరిశ్రమాలయములేమి యెన్ని యోగలవు. ప్రతివత్సరము క్రమక్రమముదప్పక స్త్రీల నిర్వాహకము క్రింద సభలు, ప్రదర్శనములుగూడ పెక్కు జరుగుచున్నవి. ఈ సందర్భములలో మహిళలకొక ప్రత్యేకపతాకముండి వానిస్థాపనము గూడ జరుగుచుండినచో నెంతయో ప్రయోజనకరముగ నుండగలదు.

పతాకధారణమనిన సామాన్యవిషయము గాదు. పతాకధారణమునందు జాతికి యుత్తేజము గలిగించు నాకర్షణయు, ఆశయములను సాఫల్యమొనర్చుకొను దీక్షాశక్తియు ఉద్యమమును వ్యాప్తిపొందించు మహాప్రభావమునుగలదు. ఇన్నిమాటలేల? జాతికి జీవముజెండా. ఉద్యమమునకు శుభచిహ్నము జెండా. ఆశయముల ప్రతిబింబము జెండా, కాన విఘ్నేశ్వరపూజలేక యేహిందూ మత సంస్కారము జరుపబడనటుల పతాక స్థాపనలేక యేయుద్యమవ్యవహారమును జరుపబడరాదు. ఈ ప్రాముఖ్యత నెఱిగియే ప్రతియుద్యమమును వర్తమానకాలమున ప్రత్యేకచిహ్నము లేర్పరచుకొనుచున్నవి. కాన మహిళోద్యమముగూడ నొకపతాక చిహ్నము నేర్పరచుకొనుట యుచితధర్మమై యున్నది.

మహిళాపతాకముయొక్క ఆవశ్యకత గుర్తింపగనే యాపతాకమేవిధముగా నుండవలయు నేవర్ణము గలిగియుండవలయునను నాలోచనగలుగుట నిక్కము. ఇది బుద్ధిశాలురగు విదుషీమణులు పెక్కుమంది పత్రికాముఖమున చర్చించి తేల్చుకొనవలసి యున్నది. మఱియు నిది కేవలమొక రాష్ట్రమునకు సంబంధించినదిగాక యావద్భారత విషయమగుటచే రాష్ట్రసభలలో బాగుగా చర్చించి రాష్ట్రసభల సూచనపై యఖిల భారతమహిళాసభ దీనిరూపురేఖలు నిరూపించవలసియున్నది.

భారతమహిళోద్యమము అఖండము. అందు అన్నిమతములవారును, అన్ని తెగలవారును, అన్ని సంఘములవారును, అన్ని రాష్ట్రములవారును గలరు. కాన మహిళా పతాక మెల్లరికిని సమ్మతమైనదిగా నుండవలయును. భారతస్త్రీలు భిన్నమత సంఘసాంప్రదాయములకు జెందియుండినను దేశమొత్తముమీద స్త్రీలకుగల కొఱతలన్నియు నొకటే. విద్యలేదు, డబ్బులేదు, వ్యక్తిస్వాతంత్ర్యము లేదు. ఈకొఱతలు దీర్చుటయే మహిళోద్యమాశయము. ఈఆశయమును విశదీకరించుటయే మహిళాపతాక కుండవలసిన ముఖ్యలక్షణము.

ఈవత్సర మాంధ్రరాష్ట్రీయ మహిళా సభ సమావేశముగులోపల నాంధ్రసోదరీమణులెల్లరీ విషయమును బాగుగా పరిశీలించి రాష్ట్రసభలో తీర్మానముగావించి యఖిలభారతసభ కందజేసిన బాగుగా నుండగలదు.

* * *

గృహపరిశ్రమలు

ఈవిషయమై గృహలక్ష్మి గృహిణీమణుల నెన్నియోవిధముల హెచ్చరించుచు ప్రోత్సాహపరచుచున్నది. కాని గృహలక్ష్ములలో సంచలనము కలుగలేదు. ఇందులకు కారణము గృహిణులకు గృహపరిశ్రమలపై నభిమానము లేకగాదు. తమ కందుబాటగు పరిశ్రమ యేదియు వారికి కానుపించకుండుట చేతనే వారు మూకీభావముతోనున్నారు. వివిధములగు గృహపరిశ్రమలు సులభముగా చేయతగినవి యెప్పుడు కానుపించునో అప్పుడే స్త్రీలలో ఉత్సాహము జనించును.

గృహపరిశ్రమ లనగనే యెల్లరిదృష్టి రాట్నముపైపోయి వాలుచున్నది. రాట్నపు పరిశ్రమ యిలువెడలకుండ నింటియుందే యుండి విశేషపెట్టుబడిలేక సులభముగా చేయతగినది కావున నిది గృహిణులగు స్త్రీల కనువైన పరిశ్రమయని చెప్పబడుచున్నది. రాట్నము గృహపరిశ్రమైనమాట వాస్తవము. ఇది స్త్రీల కనువైనదగుటయు తథ్యము. పూర్వమునుండియు నిది స్త్రీల చేతనే నిర్వహింపబడుచుండుటయు సత్యమే. నిజమాలోచించినచో నిర్వ్యాపారముగా కూర్చుండెడిస్త్రీలు వ్యర్థములగు గవ్వలతోను, గచ్చకాయలతోను, నిరుపయోగములగు ముచ్చటలతోడను, కాలక్షేపము చేయక నీరాట్నపు పరిశ్రమను చేబట్టినచో వ్యర్థముగా పుచ్చెడితీరుబడికాలమును సొమ్ముగా కూర్చిపెట్టెడి సత్తా రాట్నపుపరిశ్రమకు గలదు. అర్థార్జనావకాశము లేశమైనను లేని స్త్రీల కిదియొకవిధమగు అర్థోపార్జనాసాధనమనుటకు సందియము లేదు. కాని యేపనినైనను యేయుద్దేశముతో చేసితిమో ఆయుద్దేశము సఫలముకానియెడల దాని యందుత్సాహము నశించుట సహజము. రాట్నపు పరిశ్రమవలన నట్టిస్థితియే యేర్పడినది. 1921 సంవత్సరములో మహాత్ముడు 'కోటిరూపాయలు, కోటిమంది సభ్యులు, 20 లక్షలరాట్నములు, ఒక్కసంవత్సరములో స్వరాజ్యము,' అనిచెప్పగనే ప్రజాహృదయములో నొక యావేశోత్సాహము రేకెత్తి భారతీయులెల్లరు 'రాటము, రాటము' అని కలువరించి రాట్నములుగొనిరి. ఇంటింటను రాట్నదేవత మంజులరవములు శ్రుతిగోచరమైనవి. ఆబాలవృద్ధపర్యంతరము స్త్రీపురుషులెల్లరు రాట్నలక్ష్మి యుపాసకులేయైనారు. ప్రతియింటను బోలెడు నూలుత్పత్తైనది. కాని అందులో వస్త్రరూపము చెందినది మాత్రము చాలతక్కువ, ముక్కాలుమువ్వీసము వృథా అయినది. వడికిననూలును తీసుకొనిపోయి సరసమగు ధరలకు నేసియిచ్చు నేతయేర్పాటులు లేకపోవుటవల్లనే అంత నూలుత్పత్తియైనగూడ వ్యర్థమై పోయినది. అంతటితో వడుకువారి యుత్సాహముగూడ చల్లారినది. ఉద్యమపు పొంగును తగ్గినది.

ఈయుద్యమమారంభమై దాదాపు పదునారువత్సరములు గడచిపోయినను రాట్నపు

పరిశ్రమయొక్క వడుకు నేత సౌకర్యములావిధముగనే యున్నవి. తక్కువసమయములో నెక్కువనూలు వడుకగలరాట్నములను కొందఱు నూతనముగా నిర్మించినటుల అప్పుడప్పుడు పత్రికలలో ప్రచురింపబడుచుండును. కదురు, దిండు, చెవులు, వడిదారము మున్నగువానిలో అనుకూలమగు మార్పులు జరిగినవనిగూడ వ్రాయుచుందురు. కాని వీనిలో నొక్కటియు గృహపరిశ్రమాభిలాషగల స్త్రీల కందుబాటులో లేవు. తగినసౌకర్యములు కలుగజేయకున్న స్త్రీలకు నూలువడుకుటయందు కుతూహలము వర్ధిల్లజేయుట కష్టము. స్త్రీలలో గృహపరిశ్రమాభిలాషను గలిగింపనాశించెడి మహనీయులీ విషయములను గమనింపవలసియున్నది.

కుటీరపరిశ్రమలవల్ల స్త్రీలకు దేశమునకుగూడ ప్రయోజనముగలదు. స్త్రీల కార్థికోపపత్తికలుగును. దేశమున స్వదేశీవస్తువ్యాప్తికలుగును. ఇంతకంటె శ్రేయోదాయకమగు విషయమేమున్నది? అయితే స్త్రీలకు తా మవలంబింపదగు పరిశ్రమలు చేజిక్కుటయు, స్త్రీలెల్లరు సోమరితనము మాని పరిశ్రమయందలి విలువను తెలిసికొనుటకు సంభవించినప్పుడుగదా యీ భాగ్యము కల్గునది.

---

# తనువుచాలింప దేహి సార్థకముగాంచు

శ్రీమతి అడపా సుగుణమణిగారు

జగతి సాహసవంతులు జత్తురెపుడొ
యపుడునొకమారు చవిజూడరెపుడుచావు
పిరికిపందలు జత్తురు పెక్కుసార్లు
నిధనకాలంబునకు పూర్వపథమునందు.

మృత్యుదేవత దేహిని ప్రత్యహమును
గాచి కబళింపనుంకించి వేచియుండ
నవని బుట్టుటగిట్టుట కనుచునెఱిగి
చావునకు రోయు టదియేమి చవటదనమొ

పుష్ప ముదయించి వికసించి పొలుపునూవు
నపుడు గోసినగూలాబి యందమమరు
నిండు యౌవనమున దేలుచుండువేళ
తనువుచాలింప దేహి సార్థకముగాంచు.

# పశ్చిమదేశ గ్రంథాలయోద్యమము

యార్లగడ్డ శ్రీకృష్ణ చౌదరిగారు

(గతసంచిక తరువాయి)

## జర్మనీ

6 కోట్ల 60 లక్షల జనసంఖ్య గలిగి 51 కోట్ల రూపాయలు శివిస్యూ చెల్లించు దేశమిది. వీరప్రసవిని యని పేరు ప్రఖ్యాతుల గాంచిన దేశమిది. 1914 సం॥ మొదలు 1917 సం॥వరకు ప్రళయభయంకర యుద్ధజ్వాలలు యూరఫ్‌ఖండాన్నంతా ఆవరింపజేసి, విజయలక్ష్మీకరగ్రహణాభిలాషిణియై యుద్ధమొనర్చిన దేశమిది. విద్యలకు పరిశ్రమలకు నునికిపట్టైయున్న దేశమిది. అనేకవిధములగు జలాంతర్గాములను, వాయువిమానములను గనిపెట్టిన దేశమిది. ఇంక మరెన్నియో కళలచేతను, వృత్తివిద్యలచేతను, ఆరితేరినది. ఈ దేశ గ్రంథాలయోద్యమము దేశసౌభాగ్యమున కెంతయో తోడ్పడినది. "బెర్లిన్ స్టేట్ లైబ్రరీ" అను నొక గొప్ప గ్రంథాలయము బెర్లిన్ నగరములో గలదు. అందు 23 లక్షల అచ్చుపుస్తకములు గలవు. అధర్వణవేదాది వేదశాస్త్రము లెన్నియో ఈ గ్రంథాలయంబున గలవు. అనేకరకముల వార్తాపత్రికలు ఈ నిలయము నలంకరించుచుండును. దినసరి పాఠకుల సంఖ్య వందలకొలది పెరుగుట ఈ గ్రంథాలయ వార్షికనివేదిక నుండి తెలియనగును. ఈ కేంద్రమునుండి అనేక జిల్లాల తాలూకా గ్రంథాలయములకు పొత్తములు బంపబడుచుండును. విశేష రాజకీయగ్రంథములు ఈ గ్రంథాలయమున గాననగును. ఇంకను పెద్దగ్రంథాలయములు మరికొన్ని గలవు. "మ్యూనిచ్ స్టేట్ లైబ్రరీ"లో 16 లక్షల 50 వేల అచ్చుగ్రంథములును గలవు. "ట్రాస్‌బర్గ యూనివర్సిటీ లైబ్రరీ"లో 13 లక్షల అచ్చుగ్రంథములును గలవు. లక్షపుస్తకములకు తక్కువలేని గ్రంథాలయములు మరికొన్ని గలవు. సామాన్యగ్రంథాలయములు మరికొన్ని గలవు. సంచారగ్రంథాలయంబులు చురుకుగా పని చేయుచున్నవి. ఈదేశపు భావిసౌభాగ్యము వార్తాపత్రికల వలననే విదితమగుచున్నది.

## ఐర్లండు

ఈ దేశముయొక్క విస్తీర్ణము 23,582 చ. మైళ్లు. ఇందున్న ప్రజాసంఖ్య 42,56,561. నేడీ దేశము "డి వెలరా" నాయకత్వమున నడుపబడుచున్నది. ఈ దేశపు ప్రజలలో ప్రప్రథమమున గ్రంథాలయోద్యమమునందు సదభిప్రాయము గలుగజేసిన ప్రథముడు, ముఖ్యుడు "థామస్ డేవిస్". ఈతడు సర్వప్రవర్తకుడు. దేశమునకు చక్కని హితబోధ జేసిన మేధావి; దేశముయొక్క భాగ్యోదయమునకు మంచి పాఠశాలల స్థాపనమే ముఖ్యమనియు, వానికన్న ధర్మపుస్తక భాండాగారములు మరింత ముఖ్యములనియు, మంచి గ్రంథాలయస్థాపనము ఎదుట మానవుని తదితరములైన ఘనకార్యములు దిగదుడుపునకైన పనికి రావనియు, డేవిస్ మహాశయు డొకప్పు డని యున్నాడు. ప్రతిచోటను గ్రంథాలయంబులను పఠనమందిరములను నెలకొల్ప దేశీయులను ప్రార్థించినాడు "ఇది మంచిసమయము. దీని నజాగ్రత్తవలనను, ఉత్సాహశూన్యతచేతను త్రోసిపుచ్చిన చివరకు దానికై వగవవలసివచ్చును" అని యా మహాశయుడు "నేషన్" పత్రికయందు హెచ్చరిక దెలిపినాడు. దురదృష్టవశమున యీతరుణమును ప్రజలు గమనింపలేదు. ఇంతలో అనగా 1845 సం॥లో "డేవిస్" మహాశయుడు మరణించెను. సంస్కరణోద్యమమునకు

చెందిన యూతని స్నేహితులు దేశమునుండి తరుమ గొట్టబడినారు. "డేవిస్" మహాశయునిచే ప్రారంభింపబడిన గ్రంథాలయోద్యమము 60 సం॥లు కాలగర్భాన గలసిపోయెను. తిరిగి యీ యమృతజీవుని యాశయము పందొమ్మిదవ శతాబ్దమున ఫలస్వరూపముదాల్చి నేఁ డత్యంతమైన మహోన్నతదశ నందగలిగినది. ఐర్లండు దేశ ముఖ్యపట్టణమగు నొక "డబ్లిన్" నగరమునందే 2, 3 పెద్దగ్రంథాలయంబులు గలవు. అందులో "నేషనల్ లైబ్రరీ" కేంద్రస్థానము వహించి పని జేయుచున్నది. ఈనగరములో గ్రంథాలయములు చక్కని నవీనపద్ధతులలో నడుపబడుచున్నవి. గొప్పవిజ్ఞానము ప్రజలు పొందగలుగుచున్నారు. వీనియందు 1 లక్ష 50 వేల గ్రంథములు గలవు. పాఠకుల సంఖ్య 10 లక్షలకు మించుచున్నది. ఇదియంతయు నొక్క డబ్లిన్ నగరమునందే యను మాటను పాఠకగణము మరువకుందురుగాక. ఈ గ్రంథాలయములందు చాల శాఖలున్నవి. వీని యాజమాన్యమున 1932-33 సం॥లో అనగా ఒక్క సంవత్సరములో ఆంగ్ల-ఐరిషుభాషలలో 100 వుపన్యాసము లివ్వబడినవి. ఈ దేశంలో గ్రంథాలయోద్యమముఅవిచ్ఛిన్నముగా సాగిపోవుటకు మరియొక కారణముగూడ గలదు. అది కార్నెజీ మహాశయుని ధనసహాయము. అదాత 1900సం॥నుండి 1913 సం॥ల మధ్య చేసిన ధనసహాయము మొత్తము రు. 22 లక్షల 50 వేలు. ఈ మహనీయుని ధనసహాయమే మొదట లేనియెడల ఐర్లెండు గ్రంథాలయోద్యమము యింత యభివృద్ధిలోకి రాజాలకపోయెడిదే యని దలపవలసివచ్చును.

## బెల్జియం

యూరఫ్‌ఖండములో ఫ్రాంసు — జర్మనీదేశముల యొక్క పరిహద్దుల్లో యున్న వీరారాధనకు, నగ్రస్థానమును వహించిన దేశమిది. 1914 సం॥పు జర్మనీయుద్ధమందు జర్మనీవారిచేత తయారుచేయబడిన మందు గుండు సామగ్రిలో మూడువంతు లీ దేశవీరులకే యాహుతిచేయునంత వీరత్వముజూపినది. ఈదేశముయొక్క విస్తీర్ణం 11,750 చదరపుమైళ్లు. జనసంఖ్య 82,47,950. చెల్లించురివిన్యూ రు.10 కోట్లు. ఈదేశముయొక్క పూర్వచరిత్ర తిలకించిన, రోము సామ్రాజ్య చక్రవర్తియగు "సీజరు" ఐరోపాఖండాన్నంతా జయించినమీదట కొన్ని రోముకుటుంబాలు యీదేశములో బాదుకుపోయినవి. వారియింట్లో వారు సేకరించుకొనిన పొత్తములే వారి స్వంతగ్రంథాలయములుగా వ్యవహరింపబడుచుండెడివి. అట్టి వాటిలో ప్రసిద్ధిజెందిన స్వంత గ్రంథాలయములు "బర్గండీ" ప్రభువులకు "పిలిఫ్ ది గుడ్" అనే రాజుకు జెందినవైయున్నవి. వారి స్వప్రయోజనమునకే యీ గ్రంథాలయము లుపయోగపడుచుండెడివి. ఆసలు పబ్లిక్ గ్రంథాలయాలు బుట్టుట, తన పూర్వీకులైన గ్రంథాలయాన్ని "మేరీ థెరిసా" అనునామె 1772 సం॥లో అందరినిమిత్తము బహిర్గతపరచి ధన్యత్వముబొందినది. "పిలిఫ్" సంపాదించిన గ్రంథభాండాగారము ప్రస్తుతపు "దిరాయల్ లైబ్రరీ ఆఫ్ బ్రూసెల్స్"కు జీవనాధారమైయున్నది. పబ్లిక్ గ్రంథాలయాలకు మొట్టమొదట యీదేశమే దారి జూపినట్లు తెలియుచున్నది. గ్రంథాలయోద్యమందు ప్రజలకును, ప్రభుత్వమునకును, మిక్కిలి యాదరణాభిమానములుగలవు. కాబట్టియే, యీచిన్న దేశ మింత యభివృద్ధికి రాగలిగినది. ఈదేశముయొక్క 1929 సం॥రపు లెక్కలనుబట్టిచూచిన 2188 గ్రంథాలయంబు లీ దేశమునగలవు. అందున్నపొత్తములు 38,15,002 చదువరుల సంఖ్య 585426. చదువబడిన పొత్తముల సంఖ్య 71,81,437. అనగా నొక్కపుస్తకమును సంవత్సరమొత్తంలో పాఠకుడు 8 పర్యాయములు చదివినట్లు తెలియుచున్నది. కేవలము గ్రంథాలయములందు పుస్తకములకు జేర్చుటయేగాదు, అందున్న విజ్ఞానము

మననము చేయవలెను. అందుగూడ నీదేశమే మార్గదర్శకత్వము వహించినది.

## ఫ్రాంసు

నాగరికతకు, శృంగారపట్టణనిర్మాణమునకు ప్రసిద్ధి జెందిన దేశమిది. ఈదేశముఖ్యపట్టణమగు "ప్యారిసు" ప్రపంచమందున్న పట్టణములన్నిటిలో శృంగారపట్టణమని ప్రతీతిబొందినది; ఈదేశమున 4 కోట్లమంది జనులున్నారు. చెల్లించురివిన్యూ. రు. 60 కోట్లు. పరిశ్రమలలోను, వ్యాపారములోను యూరఫ్లో వెనుకబడని దేశమిదియే. గ్రంథాలయోద్యమ మీదేశమున బాగుగా ప్రచారమందున్నది. ఒక్క సంచారగ్రంథాలయములకే, ప్రతియేట కొన్నివేల పౌన్లు ఖర్చుపెట్టుచున్నట్లు తెలియుచున్నది. "ప్యారిసు" పట్టణమున "బిబ్లియోతిక్ నేషనల్ గ్రంథాలయం" అనునొక గ్రంథభాండాగారము గలదు. అందు 40 లక్షల అచ్చు గ్రంథములున్నవి. అనేకవార్తాపత్రికలు యీ గ్రంథాలయమునకు వచ్చుచుండును. శాఖాభాగములనేకములు గలవు. ఈ గ్రంథాలయమునుండి యితర గ్రంథాలయములకు రైల్వేద్వారా, పోస్టుద్వారా, ప్రచారకులద్వారా, అనేక గ్రంథములుపోవుచు, వచ్చుచుండును. ఈదేశమున గ్రంథాలయోద్యమము, చక్కని పద్ధతులమీద, నడుపబడుచున్నది. ప్రభుత్వాదరణ యీయుద్యమమున కెంతయో చేయూతనిచ్చుచున్నది.

## ఇంగ్లండు

రవి యస్తమింపని రాజుల పరిపాలనమందు రాజకీయపరిజ్ఞానమం దారితేరిన దేశమిది. వ్యాపారపరిశ్రయం దెక్కువధనము గడించుచున్నది. విమానపరిశ్రమయందు, యుద్ధపుటోడలు తయారుజేయుటయందు ముందంజవేయుచున్న, దేశమిది. ప్రపంచమంతటిలో కడుగొప్పదగు "హౌండ్" అను యుద్ధస్టీమరు యీదేశములోనే గలదు. ఈదేశ గ్రంథాలయోద్యమ మెట్లున్నదో విచారింతము.

ఆక్స్ఫర్డులో "బోడ్లీ"యను బహుపురాతనమైన గ్రంథాలయం బొకటిగలదు. అందు 12 లక్షల 60 వేల గ్రంథములున్నవి "కేంబ్రిడ్జియూనివర్సిటీ" గ్రంథాలయములో 12 లక్షల 50 వేల అచ్చుగ్రంథములు విరాజిల్లుచున్నవి. ఇంగ్లండుముఖ్యపట్టణమగు "లండన్"నగరములో "మ్యూజియంగ్రంథాలయం" కలదు. అందు 40 లక్షల అచ్చుపొత్తములు గలవు. ఈ గ్రంథాలయమునకును "బోడ్లీ" గ్రంథాలయంబునకును ఇంగ్లండులో ప్రచురింపబడు నన్ని గ్రంథముల యొక్కయు నొక్కొక్క ప్రతి చెందునటుల శాసనము జేయబడ్డది. అనేకరకముల వార్తాపత్రికలు, చిత్రప్రదర్శనములు యీ గ్రంథాలయంబున నీదేశమున విరివిగా ప్రచారమునందున్నవి. కొన్నివేల పుస్తకములు గల సంచారగ్రంథాలయము పాఠకులకు పుస్తకములందింపజేయుటకు వచ్చుచుపోవుచుండును. గ్రంథాలయోద్యమావశ్యకతలనుగూర్చి, యితర యుపన్యాసములు జరుగుచుండును. ఈదేశముతో 100 కి 98 మంది చదువుకున్నవారు గలరు. "లండన్"నగరములో 44 లక్షల ప్రజల విద్యాభివృద్ధికొఱకు, నొక్క, మునసిపాలిటీవారే 17 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టుటలో నిరక్షరాశ్యులకు నీదేశములో తావెక్కడ? అంధులుగూడ విద్యావిహీనులుగా నుండగూడదను వాంఛాపునాదులు 1882 సం॥రమున యీదేశములో వేయబడ్డవి. "నేషనల్ లైబ్రరీ"వారు అంధులకై ఎత్తుపల్లములుగల పుస్తకరూపమున సలుపుచున్న సేవ యెంతయో ప్రశంసింపదగియున్నది. 1882 సం॥రం, అంధులకొరకు ప్రత్యేక గ్రంథాలయంబులు స్థాపింపబడినవి. గ్రంథాలయాధికారులు గ్రుడ్డివారికొఱకు, నిరంతరకృషి జేసి యిప్పటికి 1 లక్ష 85 వేల యెత్తుపల్లముగల పుస్తకములు వృద్ధిపరుపగలిగినారు. ఈ పుస్తకములలో నక్షరములు యెత్తుగనుండును. వీటిని

చేతితో తడుముటద్వారా అంధుడు, చదువగలుగును. ఈదేశములో 11000 గ్రుడ్డి చదువరులున్నారు. వారిలో 800 మంది పోస్టుద్వారా పుస్తకములు తెప్పించి చదువుకొని పంపుచుండెదరు. "నేషనల్ లైబ్రరీ"వారు గ్రుడ్డివారల పుస్తకములకొరకై 1935 సం॥లో రు 3 లక్షల 60 వేలు ఖర్చుబెట్టినారు. ప్రశస్తములైన గ్రంథములైతేనేగాని వీని గ్రంథాలయమున చేర్పబడవు. గ్రంథాలయోద్యమమీ దేశములో తృప్తికరమైన సేవజేయుచున్నది.

ఆస్ట్రియా

ఈదేశ ముఖ్యపట్టణమగు "వియన్నా" యందుండిన "నేషనల్ లైబ్రరీ"లో 12 లక్షల 70 వేల అచ్చు పొత్తములుగలవు. గ్రంథాలయోద్యమమందు ప్రభుత్వాదరణయెంతేనియు గలదు. ఈదేశమునందు వెలువడు వార్తాపత్రికలే గాక యితర దేశవార్తాపత్రికలెన్నియో యీగ్రంథాలయంబునకు వచ్చుచుండును. ప్రపంచమంతటిలో నారోగ్యస్థానమునకు ముఖ్యస్థానము "వియన్నా". యీపట్టణమందే వీరవరుడగు సుభాసుచంద్రుడు కొంతవర కారోగ్యము బొందగలిగెను. భారతనాయకాగ్రణియైన విఠల్ భాయి యిచ్చటినుండియే, తనయంత్యసందేశమును, భారతావనికి బంపియుండెను. గ్రంథాలయోద్యమాదరణాభిమానులగు యీ దేశప్రజలు విజ్ఞానములో ముందుకు రాగలుగుటయందు ఆశ్చర్యమేమి?

---

# మాధవుడు

(భూషాంతరీకరణము)

సీ. చపలస్వభావమై సంచరింపుచు నుండు
నొకచోట వసియింప దొక్కభార్య,
పలుకరించిన మారు పలుకక మూగియై
యుండును సతతంబు నొక్కభార్య,
అనయంబును కులాలు నట్లుఘటంబుల
నొనరింపు చుండెడు నొక్కసుతుడు,
వారింపరాని దుర్వర్తనాపరతమై
నుండి బట్టిదెచ్చు నొక్కసుతుడు,
గీ. పండవారాసి యలలపై పాపసెజ్జ
పన్నగారాతి విహరింప వాహనంబు
తన గృహచ్ఛిద్రమెల్లను దలచి రోసి
దారు రూపంబుదాల్చె మాధవుడు తాను.

దేశిరాజు భారతీదేవి.

# దసరా సంచిక

అక్టోబరు మాసారంభమున గృహలక్ష్మి యెప్పటివలె వెలువడును. అందు స్త్రీలచే రచింపబడు పద్యగద్యవ్యాసములు మాత్రము ప్రకటింపబడును. దీని కాంధ్ర విద్వత్సోదరీమణులందరు తోడ్పడి దసరాసంచిక సర్వాంగసుందరముగా వెలువడునట్లు చేయుదురని ప్రార్థించుచున్నాము.

వ్యాసములు సాధ్యమైనంత క్లుప్తముగ నున్న మంచిది. వ్యావహారికముననైనను గ్రాంథికభాషయందైనను నుండ వచ్చును. కథలు, పద్యములు, విమర్శనలు, రాజకీయ ఆర్థిక, సాంఘిక, నైతిక, ఆధ్యాత్మికాది వివిధవిషయములను గూర్చిన వ్యాసములుకూడ ప్రకటింపబడును. వ్యాసములన్నియు ఆగస్టు మాసాంతములోపలనే మాకార్యాలయమునకు చేరవలయును.

సంపాదకుడు.

# గృహపరిశ్రమలు

కె. ఎం.

నూతనగృహపరిశ్రమలగల్పించి వానిని ప్రోత్సహించి యభివృద్ధికి దెచ్చి తన్మూలమున ధనార్జనముగావించు మార్గముల జూపి, మానవసౌభాగ్యమునకును దేశౌన్నత్యమునకును పాటుబడ నుద్బోధించుచున్న గృహలక్ష్మియొక్క యాశయములెంతయు సంస్థవనీయములు. ఆమెకృషియు, ఆమె జూపనున్న సౌకర్యములను వ్యర్థపుచ్చక భారతనారీమణులెల్లరు జేయూతనిచ్చి యామె కోరికల సఫలీకృతములు జేయుదురుగాత!

మానవసౌభాగ్యమునకు ఆరోగ్యభాగ్యమును ఆర్థికభాగ్యమును ముఖ్యవిషయములు. అందార్థిక మారోగ్యముపైననే నాధారపడియుండును. ఆరోగ్యమున్నచో ధనార్జనకు పెక్కుమార్గములు గలవు. పెక్కులక్షల కధిపతులైయుండియు నోట ముద్దనిడికొనిన జీర్ణముగాక, ఏపాలపైననో, పండ్లపైననో నాధారపడియుండి తమ లక్షలనుమాత్రము రేయుంబవళ్లు లెక్కించుకొనుచు సంతృప్తిబొందవలసినవారు పెక్కురుగలరు. ఆరోగ్యభాగ్య సాధనము మనమాచరించు దినకృత్యములపైననే నాధారపడియుండును. ఉషఃకాలముననే లేచి నిత్యకృత్యములదీర్చుకొని పనిపాటల చేసికొను స్త్రీకిగల మనోవికాసము, ఆరోగ్యము, చురుకుదనము సూర్యోదయాత్పరమున ఏ డెనిమిదిగంటలకో లేచి, ఇస్సునుస్సురనుచు, కాలుసేతుల నీడ్చుకొనుచు నీజీవిత మెందుకువచ్చినది భగవంతుడా యని వెక్కసపడు సోమరికుండదు. సంతోష పరితాపములు మనమనస్సుపైననే నాధారపడియుండును. వానిని మనము కలుగజేసికొనగలము.

అర్థికసౌభాగ్యము రెండువిషయములపై నాధారపడియుండును. ధనమార్జించుట, వెచ్చించుట యనునవి. అందు గృహపరిశ్రమలచే ధనార్జనచేయుటెట్లని సమస్య గలదు. ఈసమస్య ఉన్నత, అధమ తరగతుల జనుల (High and low class people) నంతగా పీడించదు. భాగ్యవంతులగు స్త్రీలు పరిశ్రమల జేసి ధనమార్జించు నగత్యముండదు. చేయదలచినను గౌరవభంగము. అధమతరగతి స్త్రీలు పెక్కు గృహపరిశ్రమలచే ధనము నార్జించుచునేయున్నారు. కొన్నివర్ణముల స్త్రీలు తమయింట పాడి నభివృద్ధిజేసి పాలు, పెరుగు, నేయి, పిడుకల నమ్మి ధనముజేకూర్చి తమ పురుషులకు దోడ్పడుచున్నారు. కొబ్బరి, తాటితోటలు గలచోట్ల కొబ్బరి, తాటిపీచులను, వాటితో త్రాళ్లను తయారుచేసి విక్రయించుచున్నారు. మేక, గొర్రెబొచ్చులతో కంబళ్లు, తివాసులుసేయుట, త్రాళ్లుపేనుట మొదలగుపనులు చేయుచున్నారు. ఆకులతో

విసనకఱ్ఱలు, గొడుగులు, చాపలు మొదలగు పరికరముల జేయుచున్నారు. వేముతో మంచములు, కుర్చీలునేయుట, సజ్జలు, పళ్లెరములు చేయుచున్నారు. ఇట్లు వారు నివసించు పరిసరముల యవకాశములబట్టి పెక్కుమంది స్త్రీలు గృహపరిశ్రమల జేసి ధనమార్జించుచున్నారు.

ఆర్థికసమస్య మధ్యమతరగతి జనులనే (Middle class people) ఎక్కువగా పీడించుచున్నది. వీరు పైపనుల చేయుట గౌరవభంగము. తాము చేయదగిన పరిశ్రమలు కాన్పించవు. ఏదియైనను చేసికొనదలచినను యంత్రసహాయమున తయారై విదేశములనుండి దిగుమతియగుచున్న సరకులను ఖరీదువిషయమునను అందమువిషయమునను పోటీ చేయలేవు. గాన వీరు తమ కొలదిరాబడిని సద్వ్యయముచేసి ఖర్చును సాధ్యమైనంత తగ్గించుకొనుటయే ధనార్జన చేయుమార్గము. మనసున్నచో మార్గముండును. ఈతరగతికిజెందిన పురుషులలో నాదాయము తక్కువైనను దురలవాట్లకులోనై కాఫీక్లబ్బులకుమరగి తమకున్న కొలదడబ్బును అక్కడ వెచ్చించి, ఇంట భోజనమురుచించక, సంసారఖర్చులకు డబ్బుసర్దుకొనజాలక, గృహిణులపై చికాకుపడుచుందురు. అట్టిభర్తల దురలవాట్లను మాన్పించి, ఆకాఫీని యింటనే తయారుచేసుకొనినచో ఎంగిలివ్యాధులు రావు. అందుచే డాక్టర్లబిల్లులు తగ్గును. శరీరారోగ్యము గల్గును. దాన కొంత ధనము మిగులును. అది యొకవిధమైన ధనార్జనయే. పరిశ్రమయే. ఈకాఫీహోటలు దురలవాటు మనదేశమున పెక్కుసంసారములబాధించి పలువంతలపాల్సేయుచున్నది.

స్త్రీలు తమయింట గంటలకొలది పెరటిలోనే తమ యాహారముల కుపరికరించు పాదులను, మొక్కలను, పూలచెట్లను పెంచి ఒక చిన్నితోటను తయారుచేసికొనినచో దాన కొంత ద్రవ్యాదాయముగల్గును. ఆమొక్కలకు సాయంకాలమున నీరు తోడిపోయుటచే శరీరవ్యాయామము గలుగును. ఎల్లపుడును పచ్చనిదృష్టిచే కండ్లజబ్బులు రావు. మనస్సున కాహ్లాదముగలుగును. ఇంటికి అందమువచ్చును. బజారునకొన్న కూరగాయలకంటె వీటిపై నెక్కువ ప్రీతి గల్గును. ఆరోగ్యము చేకూరును, తోటపనివలన తమబిడ్డలకు కొంత పరిశీలనాజ్ఞానమలవడును. పాశ్చాత్యదేశములలో తోటలులేని యిండ్లు కానరావు. మనయిండ్ల నూటికొక్కటికిని తోటగానరాదు. ఇట్టితోటల పెంచుటయందు స్త్రీకి యుత్సాహ ముండవలెను. అంగటకొన్న నూరుపూలకంటె తన మల్లెపందిట పూచిన పదిమొగ్గలె ఆమె కెక్కువప్రీతి.

మరబియ్యమువలన ననేకరోగములు కలుగుచున్నవని మనకందరకు ననుభవమే. అయినను వానిని మానలేకున్నాము. ప్రతియూరను మరలుండుటచే దంపుయులవాటు తగ్గి, దంపెడుమనుష్యులే కానరారు. వారికి మిల్లులందు గిట్టుకూలి దంపులోగిట్టదు.

ఇటీవలారోగ్యశాఖవారు దంపుడుబియ్య మునకంటె శ్రేష్ఠమైనబియ్యము తిరగటిచే తయారుచేయవచ్చునని తెలుపుచున్నారు. తుమ్మకర్రతో తిరగటిని తయారుచేయించి అందు ధాన్యముత్రిప్పినచో బియ్యము పడును. అవి మెక్కువ యారోగ్యకరము. చిన్నసంసారములగల స్త్రీలు స్వంతముగా బియ్యము నట్లు తయారుచేసికొనవచ్చును. విరివిగా తయారుచేయగలిగినచో నున్నత కుటుంబముల వారికమ్మి ధనము చేకూర్చ వచ్చును. ఇదియు నొకపరిశ్రమయే.

స్త్రీలు తమవిరామకాలమునందు తమ సంసారముల కుపకరించునట్లు తీగలతోను, పూసలతోను, పేముతోను సజ్జలు, పళ్లెరములును, కాగితపుపిండితో బుట్టలను,రంగు కాగితములతో విసనకఱ్ఱలు, పూలచెట్లు, గుమ్మముల కలంకరించుదండలును, జీలుగు బెండుచే తలపువ్వులను, కాళీయగ్గిపెట్టెలచే పల్లకులు, సవారీలు, కుర్చీలు మొదలగు యాటవస్తువులను, తలనూనెలు, పండ్లపొడులును, తమ చిన్నిబిడ్డల కుపకరించుమేజోళ్లు టోపీలు యల్లుటయును మొదలగు పరిశ్రమలజేసి తమగృహముల నలంకరించుటయేగాక వాటిని విరివిగాతయారుచేసి ధన మార్జించవచ్చును. ఇట్టిపనులు తాము స్వయముగా చేసికొనుటవలన తమకు తగ్గిన కర్చుయే తామార్జించినధనము. అదియే పరిశ్రమ.

ఇంతియగాక తమబిడ్డలకు స్వంతముగా బోధించి పాఠములనేర్పి విద్య గరపవచ్చు. తల్లికంటెను ఎక్కువగా బోధించగల గురువులేడు. మనచరిత్రలందు గాంచుచున్న శివాజీమొదలగు మహావీరపురుషులను తయారుచేసినది వారితల్లులే యని యెఱుంగుచున్నాము. ఇపుడెచ్చటజూచినను ఇంటింట నొక నుపాధ్యాయుడువచ్చి పిల్లలకు చదువుచెప్పి పోవుచుంట గాంచుచున్నాము. దాన బిడ్డలకు విద్యాప్రాప్తిగల్గినను లేకున్నను తలిదండ్రులకు ద్రవ్యనష్టముమాత్రము గలుచున్నది. తాముస్వంతముగా బోధించుకొన్నచో ఈకర్చుకూడతగ్గి ఆదాయము కలుగును. ఇట్లు స్త్రీలు స్వంతముగా తమయింట చేసుకొనగలిగినపనులు పెక్కులుగలవు. ఓపిక, శ్రద్ధ, కుతూహలము మాత్రము కావలెను. తాము క్రొత్తగృహపరిశ్రమలకనిపెట్టి యాచరించలేకపోయినను తమ వ్యయము నరికట్టి తగ్గించుటయే ధనార్జనము. అందులకు జేయుకృషియే గృహపరిశ్రమ. చిల్లరనుకూడబెట్టినచో టోకు తనంతతానే పెరుగును. (Take care of the pence ; the Pounds will take care of themselves.)

నేడు నవీననాగరికత యను పేరుతో స్త్రీలు పేపనియుజేయక, సోమరితనముబలిసి దానివలన బలహీనత, నసమర్థతగలిగి ప్రతి వస్తువునకు నితరులపై నాధారపడి, తాము స్వయంకృషిచే చేసుకొనగలిగినవానినికూడ మాని బజారుపై బడి రోగముల కొనితెచ్చుకొనుచున్నారు. ఇది యారోగ్యభాగ్యము నకు చేటు. ఏగృహమునకు నలయుపరికరముల నాయింటిస్త్రీలే వీలైనంతవరకు చేసు

కొనవలయును. అందు పెక్కుపరిశ్రమలు గలవు. అందరు నొకేపరిశ్రమనాచరించి విరివిగా వస్తువులతయారుజేసినచో విడుదల బాధ గలుగవచ్చును. అయినను అనుభవజ్ఞులైన సోదరీమణులు క్రొత్తగృహపరిశ్రమల కనుగొని తోడిసోదరీమణుల కాదర్శప్రాయులై తన్మూలమున దేశసౌభాగ్యము చేకూర్తురుగాక!

హిందూసంఘమున వైవాహికాదికార్యములందు శక్తికిమించి సవ్యయమొనరించుట చేతనే పెక్కుసంసారములు శిథిలములై తరువాత కూటికిని గుడ్డకును లేక బాధపడుచున్నారు. వరశుల్కబాధ నానాటికిని హెచ్చుచున్నది. శారదాబిల్లు ఆబాధను తగ్గించుననునాస జనించియు, నది విరివిగా నమలునందుండకపోవుటచే వరశుల్కబాధ తగ్గుటలేదు. ఎన్ని గృహపరిశ్రమలకనుగొని ఎంతకష్టపడి ద్రవ్యార్జన మొనరించినను వైవాహికాది కార్యములందు అమితవ్యయమును, వరశుల్కములును తగ్గిననేకాని మానవసౌభాగ్యము చేకూరదు. ఇందుకు ప్రభుత్వమే చట్టముల గావించుట మంచిదిగానోపు!

---

## ప్రణయిని

శ్రీ హెచ్. పట్నాయక్కగారు

పరదేశి వారిబిడ్డఁట, విరిబోఁణులయందుఁ జంద్రబింబం బఁట గో
పరిపాలునిపై వలపఁట, మురళిన్ వినఁ గోరికయఁట ముప్పొద్దులలోన్.
రసికత మీఱ భాస్కరుఁడు ప్రాక్సతి రంజిలఁ జేయువేళ, నా
బిసరుహనేత్రి గోవులను వీడి వినీలశరీరుఁ జేరు, సం
తసమునఁ గ్రీడలం జెలఁగి, తద్దయు వేడ్కతోడ మెల్లఁగా
వసతికి నేగుఁ బశ్చిమపు భామను జేరిన భాను దూఱుచున్.
వాడవాడల వ్యాపించె వలపువార్త, మాతృనిర్బంధమునఁ జిక్కి మగువమిన్న
కృష్ణదర్శనార్థము నిరీక్షించుచుండె, దివసమంతయు నెడబాటుదిగులుతోడ.
కమలాప్తుఁడ స్తమించెను, తిమిరంబులు క్రమ్ముచుండె, "దీపము తేవే
క్రమధాటి వారియింటను, కమలా!" యనె మాతృదేవి కార్యాతురయై.
సమయము చిక్కెఁగా యనుచు సంతసమందుచు సారసాక్షి సం
భ్రమమున మామనోహరుని మందిరమేగెను, ప్రేమరాధికా
రమణి యొనర్చు సేవనల రమ్యముగాఁ గొనుచున్న కృష్ణు, దీ
పము వెలిగించు చా కమల వారక కోరిక దీరఁ జూచుచున్.
మైమఱచె, దివ్వెమాఱుగాఁ, గోమలమగు వ్రేలుకాల్చుంట యెఱుఁగదు, వెదకికొనుచు
జననివచ్చి లబోలబో మనిన వఱకు, ఔర! ప్రేమమాహాత్మ్యమే మసఁగ వచ్చు!

# పావంచాలు

తెన్నేటి సూరిగారు బి. ఎ.

*
* *

[రవీంద్రుని కథ]

[స్వర్ణయుగ పరిషత్]

మునుపటి ముచ్చట్లేమైనా వినాలనివుంటే, నాయీ మెట్లమీదకూర్చో, ఈనదీజల మర్మరానికి చెవియొగ్గి-

ఆశ్వయుజమాసం ప్రారంభమైంది. నదీగర్భం తటపటాయించి వుంది. నాలోనాలుగు మెట్లు మాత్రం మిగిలాయి నీటిపైన. పల్లాలుగావున్న చోట గట్లదాకా ఎగబ్రాకింది నీరు. మామిడి గుబురుల నీడను నాచు దట్టంగా అల్లుకునివుంది. ఆయేటివంపులో మూడు ఇటుకరాతికుప్పలు, నీటిపైన కనుపించుతూవున్నాయి, గోపురాలులా. చిన్న చిన్న పడవలు—చేపలుపట్టేవి—గట్టుమీదవున్న మర్రిచెట్లుకు కట్టివేసివున్నాయి. ఆ చిటికెరటాలమీద అవి అటూయిటూ వూగుతూవున్నాయి వుయ్యాలలులా. ఆగట్టుమీదవున్న త్రోవకు ఇరువైపులా పచ్చగడ్డి ఎత్తుగా పెరిగివుంది. వూత పడుతూపడుతూవుంది. ఇంకా విరియపూయలేదు.

అది నవోదయవేళ. ఆసూర్యకాంతులా గడ్డిపూలమీద పడుతూవున్నాయి. ఆబుల్లి పడవలాకటాకటే తెరచాపల్లోకి గాలిపోసుకుని రవికిరణప్రసారితమైన ఆగంభీరనదీ గర్భంమీద సాగిపోతున్నాయి, యానాని కుపక్రమించి ఒక కర్మిష్ఠి తనసుబ్రహ్మణ్యపాత్రవర్గంతో సహా స్నానానికి విచ్చేశారు. ఈవూరి పడుచులు, బిందెలు చంకల్నబెట్టుకుని, ఇద్దరిద్దరూ, ముగ్గురు ముగ్గురూ, జట్లుజట్లుగా వస్తున్నారు—నీళ్లకోసం.

కుసుమ వచ్చేవేళయింది.

కాని ఆవేళ అబిడ్డరాలేదు. భువన, స్వర్ణ—కుసుమ సంగతి చెప్పుకుని ఊసూరుమన్నారు. కుసుమను అత్త వారింటికి తీసుకుని వెళ్లారట. ఆవూళ్లోఅంతా అదో వాలకం మనుష్యులు, అవోరకం ఇళ్లు, అదోతరహా బజారులు, వున్నాయట. ఆవూరు నదికి చాలాచాలా దూరం కూడానట.

ఆపిల్లసంగతే నాకు జ్ఞప్తితప్పింది. ఒకసంవత్సరం దాటింది. రేవుదగ్గరకూడా ఆడవాళ్లు కుసుమసంగతి చెప్పుకోటమే మానేసేశారు. ఇలావుండగా, ఒకనాటి సాయంత్రం, కుసుమతల్లి సన్ననిపాదుగు పాదాలసంయోగం నాకు కలిగింది. నేను విస్ఫురితనయాను. ఆ! ఔను! ఆపాదాలే! కాని, వాటికి మంజీరాలులేవు. అవి పూర్వపు మంజుశింజితాలను పోగొట్టుకున్నాయి.

కుసుమకు వైధవ్యం వచ్చింది. కుసుమభర్త ఎక్కడో చాలాదూరాన పనిచేస్తూవుండేవాడట. ఆబిడ్డతణ్ణి ఎప్పుడో ఒకటి రెండుమార్లు చూసివుండేమో. అతను చచ్చిపోయాడని ఒకవుత్తరం వచ్చింది. ఆమెకు వైధవ్యం — ఎనిమిదవసంవత్సరాన ముఖానవున్న కుంకుమ రేఖ చెరుపుకుంది. మెళ్లోవున్నసూత్రం తెంపుకుంది. కాళ్లకడియాలూ గట్టాఅన్నీ తీసేసుకుంది. పుట్టింటికి వచ్చేసింది. కాని ఆమె సావాసగత్తెలంతా, ఒక్కళ్లైనా కనుపించకుండా వెళ్లిపోయారు. భువన, స్వర్ణ, అమల అంతా అత్తవారిళ్లకు వెళ్లిపోయారు. సరస్వతిమాత్రం వుంది. ఆఅమ్మాయినికూడా పుష్యమాసంలో కాపురానికి పంపుతారనుకుంటున్నారు.

వర్షారంభం దగ్గరనుంచీ,గంగాకూలంకష చరచరా ప్రపూర్ణతకు పెంపొందినట్లుగానే, కుసుమసహితం సౌందర్య ప్రపూర్ణతకు యవ్వన ప్రపూర్ణతకు పెంపొందింది. కాని వివర్ణమైన ఆమెవస్త్రాలిలూ, ఆత్యాలోచనలోపడ్డముఖం ఒక ముసుగులాగా ఆమె యవ్వనాన్ని పురుష దృక్పథంనుంచి కప్పిపుచ్చుతూవుంది. పది

సంవత్సరాలు జరిగాయి. తనుయింతగా యవ్వనపూరిత దైవవిషయం కుసుమ గ్రహించినట్లుగాలేదు.

ఒకనాటి ఉదయం, ఒకసన్యాసి—పొడుగుపాటి సన్నని సురూపి—ఎక్కడనుంచివచ్చాడో తెలియదు. ఆయెదుటవున్న శివాలయంలో వాసం ఏర్పరుచుకున్నాడు. ఆతనిరాక ఊళ్లోవున్న ఆబాలగోపాలానికీ తెలిసింది. మహిళామండలి యావత్తూ, బిందెలు దూరంగా విసిరేసి గుంపులుగుంపులుగా ఆదేవాలయంలోకి మూగడం మొదలుపెట్టారు స్వామివారికి సాష్టాంగంచేసేందుకు.

జనసమ్మర్దం దినదినం పెంపొందుతోంది. స్వామివారి ఖ్యాతి మహిళాజనంలో నిప్పులా అంటుకుంది. వారు ఒకదినం భాగవతం చదివేవారు. మరోరోజు గీతకు వ్యాఖ్యానంచేసేవారు. ఇంకోరోజు ఇంకో పవిత్రగ్రంథాన్ని సమర్థించి ఉపన్యసించుతూ వుండేవారు. కొంతమంది మంత్రాలకోసం కొంతమంది తంత్రాలకోసం మరోకొందరు మందుమాకులకోసం, ఆయన చుట్టూ మూగుతూండేవారు.

ఇలాకొన్నిమాసాలు గడిచాయి. అది ఏప్రియల్ నెల. ఆవేళ సూర్యగ్రహణం. తీర్థంలా గంగలో స్నానానికి ప్రజంతా ఇక్కడికిచేరారు. గట్టుమీదవున్న మర్రిచెట్టుక్రింద దుకాణాలుపెట్టారు. చాలామంది యాత్రికులు స్వామివారిని చూడ్డానికివెళ్లారు. వాళ్లల్లో ఒకగుంపు కుసుమ అత్తవారి ఊర్నుంచివచ్చిన ఆడువారుకూడా వున్నారు.

అది ప్రాతఃకాలం. సన్యాసి నా పావంచమీద కూర్చుని జపతావళంత్రిప్పుతూవున్నారు. ఇంతలోనే ఒకభాగ్యశాలి మోచేత్తో ప్రక్కనున్నావిడను విస్ఫురితను చేసి, "ఒసే! ఈయన కుసుమ పెనిమిటి గాదుటే?" అంది. ఆరెండో ఆవిడబుగ్గన వ్రేలువేసుకుని "ఓస్, జోసెఫ్," అంది. "చైనులుగారి కడసారివాడే" అంది మూడో ఆవిడ—కొంచెం తలనెరసినావిడ. నాల్గో ఆవిడకుచ్చెళ్లు త్రొక్కుమంటూ, "జోసెఫ్! ఆ ముక్కు అదే! ఆకళ్ళు అవే! అంతా అదేనే!" అంది. మరొకయిల్లాలు బిందెతో నీళ్లుముంచుకుంటూ, సన్యాసి వేపే చూడనన్నా చూడకుండా, "అయ్యొ నా తల్లీ! ఆతగాడింకెక్కడున్నాడమ్మా! కుసుమమ్మ తల్లి ఎంతేనా దురదృష్టవంతురాలూ" అంది.

"జోసెఫ్ ఆయన కింతపొడుగుగడ్డం వుండేదికాదే" అంది ఒకపడుచు. "అవునే ఇంతసన్నగా యెందుకుండేవాడే" అంది మరొక బొద్దుగావున్నావిడ. "మీ దంతాపిచ్చి, ఆతగాడింతపొడుగెక్కడమ్మా" అంది మరొకపొట్టి కురుచావిడ. దీంతో ఆసమస్య అలా పరిష్కారమయిపోయింది—ఇంకా మహిళాజనంలో పరిపూర్ణప్రచారాన్ని పొందకుండానే.

ఆనాడుపూర్ణిమ. చంద్రుడు కొద్దికొద్దిగా పైకిలేస్తున్నాడు. కుసుమ వచ్చి నాక్రింది మెట్టుమీదకూర్చుంది నీటికి దగ్గిరిగా. ఆమె ఛాయనామీదపడ్డది అడ్డంగా.

మిడుతలు నామీదుగాపోతూ కిచకిచలాడుతున్నాయి. గుళ్ళో, జేగంటల ఝూంకారాలూ, గంటల గణగణలూ ఆగిపోయినాయి. ఆకట్టకడపటి శబ్దతరంగంకూడా తగ్గితగ్గిపోయి, ఒకనీడలా, నది కావలిగట్టునవున్న చింతలతోపు చీకట్లలో లీనమయిపోయింది. నల్లని గంగాజలంమీద వెండికరగి వోలకబోసినలా, చంద్రకాంతులుపడ్డాయి అడ్డంగా. ఆ యెదుటి గట్టుమీదా, ఆపొదలలోనూ, ఈపుంతలోను, ఆపాడుపెట్టిన యిళ్లక్రిందా, దేవాలయగోపురంలోనూ తాటితోపులోనూ. ఏవోనీడల సంచలనం. మర్రి కొమ్మల చివర్లనుంచి కబోదిపక్షులు తలక్రిందుగా వ్రేలాడుతున్నాయి. ఆయిళ్లకు కొంచెందూరంగా నక్కలు చెవులు గింగురెత్తిపోయేటట్టు ఒక్కపెట్టున బ్రహ్మాండంగాం ఊళపెట్టేసి, మళ్లా 'టపీ'మని ఆగి నిశ్శబ్దమయిపోయాయి.

గుడిలోనుంచి సన్యాసి బయటికివచ్చారు, నెమ్మదిగా. రేవులో రెండు మెట్లుదిగి, ఒక ఆడమనిషి ఏకాంతంగా కూర్చునివుండటం చూసి, చటుక్కున ఆగిపోయారు...... వెనుదిరిగిపోబోతున్నారు. హఠాత్తుగా కుసుమ తలయెత్తితిరిగి చూచింది. గవిసెన దిగజారింది. పైకెత్తుకున్న ఆమెముఖం మీద చంద్రకాంతులు పడ్డాయి.

గుడ్లగూబ గూండ్రించుతూ వారి శిరస్సులమీదుగా ఎక్కడికో ఎగిరిపోయింది. చెవులు గింగురెత్తే ఆధ్వని విని తెలివితెచ్చుకుని, ముసుగు సరిచేసుకుంది. కుసుమ నెమ్మదిగాలేచివెళ్లి సన్యాసికి సాష్టాంగంచేసింది.

స్వామివారు ఆశీర్వదించారు; "ఎవరు నీవూ?" అని ప్రశ్న.

"నన్ను కుసుమ అంటారు."

మరి మాటలేదు ఆరాత్రి. కుసుమ నెమ్మదిగా యింటికి వెళ్లిపోయింది, అడుగులు తడబడుతూ. స్వామివారు మటుకు మెట్లమీద అలాగే కూలబడిపోయారు. ప్రొద్దుమరచి అక్కడే చాలానిశివరకూ కూర్చున్నారు — ఏదో ఆలోచిస్తూ. చంద్రుడు తూర్పునుంచి బాగా పడమరకువచ్చాడు. వెనుకగావున్న వారినీడ ఆయనముందుపడ్డది. నెమ్మదిగాలేచి గుళ్లోకి వెళ్లిపోయారు.

ఆనాటినుంచీ స్వామివారి పాదముల చెంగట ఆసతి కావడానికి కుసుమ రోజూ వస్తూవుండేది. ఏపవిత్ర గ్రంథాన్నిగురించైనా ఆయన ఉపన్యసించుతూవుంటే, దూరంగా ఒకమూలకూర్చుని వింటూవుండేది. ప్రాత స్సంధ్యముగించుకుని కుసుమను పిలిచేవారు, ఆయన. మతవిషయాల్ని ఆవిడకు తెలియజెప్పుతూవుండేవారు. కుసుమకేమీ అర్థమయేవికావు. అయినా నిశ్శబ్దంగా నిల్చుని అతిజాగరూకతతో వింటూ వాటిని అర్థంచేసుకోడానికి ప్రయత్నించేది. ఆయన ఎలాచెయ్యమంటే, లెక్కలుగట్టుకుని తక్షణం అలాచేసేది. దినదినం దేవాలయంలో ఊడిగమంతా చేస్తూవుండేది - దేవపూజలో ఏమరికుండావుండేది. శివపూజకు పూలుకోసుకొస్తూవుండేది. గుడికడగడానికి నదిలోనుంచి నీళ్లుచేదుకువెళ్లుతూవుండేది.

శీతాకాలం వెళ్లిపోవచ్చినా యింకాచలివేస్తూనేవుంది. కాని, అప్పుడప్పుడు, సాయంత్రంవేళ నులివెచ్చని వసంతివాయువువీస్తోంది, దక్షిణాన్నుంచి. ఆకాశం దానిశైత్యాన్ని వదిలేస్తోంది. శరదాగమనంతో నిశ్శబ్దమయిపోయిన సన్నాయిూలూ, సంగీతాలూ మళ్లా వినుపించుతున్నాయి నెమ్మదినెమ్మదిగా ఊళ్లోనుంచి. పడవవాళ్లు వాలువ పడవలువదిలేసి, తెడ్లువేడంకూడా మానేసి బాలగోపాలపదాలు పాడుతున్నారు. శరత్తు వసంతంగా మారుతోంది. అదీ ఋతువు.

కుసుమ జాడకనబడలేదు. కొంతకాలంనుంచీ ఆవిడ రేవుకుగాని, సన్యాసిని చూచేందుకు దేవాలయంలోకిగాని రావడం మానేసింది.

ఈలోగా యేంజరిగిందో మనకుతెలియదు. కొంత కాలమైనతరువాత ఒకనాటిసాయంత్రం — కప్పెడు కప్పెడు చీకటిపడుతోంది, — వారిద్దరూ, నామెట్లమీద కలుసుకున్నారు, ఒకరికొకరు.

కుసుమ తలవంచుకుని బొటనవ్రేలితో నేలను రాస్తూ, "స్వామీ నన్ను పిలుసంపారా?"

"అవును; నీవెక్కడా కనుపించడంలేదు? దేవసేవ నింతగా అలక్ష్యచేసుకుంటున్నావేం?"

కుసుమముఖం వెనక్కుత్రిప్పి, అరచెయ్యి ముఖానికి అడ్డుపెట్టుకుని, గద్గదంగా, "నేను పాపాత్మురాల్ని ప్రభూ! అందుచేత దేవసేవలో నిలువలేకపోయాను" అంది.

"కుసుమా! నీమనస్సు అల్లకల్లోలంగావున్నదని నేను గ్రహించాను."



శ్రీమతి గంధం అమ్మన్న రాజాగారు
(ఏలూరు స్త్రీ నియోజకస్థానమునుండి అసెంబ్లీకి ఎన్నుకొనబడిరి.)



శ్రీమతి లక్ష్మీశంకరయ్యర్ గారు
(తిన్నవేలి రూరలుస్థానమునుండి అసెంబ్లీకి ఎన్నుకొనబడిరి.)



కోలాటము

కుసుమ కళవళపడ్డది; పైటచెరగు ముఖంమీదికి తీసుకుంది; స్వామివారిపాదాలదగ్గర కూర్చొనిఏడ్చింది.

ఆయన రెండడుగులు వెనక్కితగ్గి "నీహృదయం నాకు విప్పిచెప్పు; నీకు మనశ్శాంతికలిగేఉపాయం నేచెపుతాను."

కుసుమ భక్తివినయాలు ఉట్టిపడేటట్టు అంటుంది.

"తమరలా శాసించుతే నేను చెప్పవలసేవస్తుంది. కాని అప్పుడైనా తమకు సుస్పష్టంగా నివేదించుకోలేనేమో. ప్రభూ! నేనొక మహాపురుషుణ్ణి భగవంతునిగా ప్రేమించాను. వారికే భక్తిచేసుకుంటూ వున్నాను. ఆభక్తి పారవశ్యంతో నామనస్సునిండి తొణుకాడింది. కాని ఒకనాటిరాత్రి నే నొకలగన్నాను. ఆ నాప్రభువు, ఒకతోటలో ఒకమూల నాప్రక్కనకూర్చుని, నాకుడిచేతిని ఆప్యాయంగా ఆయన యెడమచేతిలోకి తీసుకుని, నా చెవిలో ప్రణయభాషలు చెబుతున్నాడు రహస్యంగా. ఆరంగం అంతా నాకప్పుడేమీ విపరీతంగా అగుపించలేదు.

కలఅదృశ్యమైపోయింది. నామనస్సుమాత్రం దాని పిడికిలిలోనుంచి విడిబడలేకపోతోంది.

తెల్లవారి మళ్లా నాప్రభువును నేను ముఖాముఖి చూచుకున్నాను. నామనస్సుకు ఆయన పూర్వంలా కాకుండా మరోలా కనుపించారు. ఆ స్వాప్నిక ప్రతిమ నాహృదయాన్ని ఆవేసించి కలవరపెట్టడం మొదలుపెట్టింది. నేను వారి సామీప్యాన్ని వదిలేసి దూరంగా పారిపోయాను. కాని ఆప్రతిమమాత్రం నాహృదయాన్ని అంటుకునేవుంది. అప్పటినుంచీ శాంతి నాలో నశించిపోయింది. నాలో అంతా చీకటి...అయోమయం."

ఆవిడ కళ్లనీళ్లుతుడుచుకుంటూ తనకథ చెబుతూన్నంతసేపూ సన్యాసి తనకుడికాలి బొటనవ్రేలితో నామెట్టుమీద గట్టిగా నొక్కుతూ వేవున్నాడు.

ఆవిడ చెప్పటం అయిపోయింది. సన్యాసి "కలలో నీవు చూచిందవరో్న చెప్పలేదేంమరి," అన్నారు. కుసుమ చేతులునులిపికొంటూ "నన్ను మన్నించాలి: చెప్పలేను," అంది గద్గదంగా.

"చెప్పాలి."

"ప్రభూ! తప్పదూ?"

"చెప్పాలి,—ఆజ్ఞాపించుతున్నాం."

"నా స్వాప్నికపురుషుడు తమరేప్రభూ!"

కుసుమ వెక్కివెక్కియేడుస్తూ, అతనిపాదాల దగ్గర ఆపాషాణాలమీద కూలబడిపోయింది.

కొంచెంసేపటికి తెప్పరిలి కుసుమలేచి కూర్చుంది— కన్నీరు జోటజోటకారుస్తూ.

స్వామివారు నెమ్మదిగా, "నీవు నన్ను మళ్లా చూడకుండా వుండేందుకుగాను, ఈ ప్రదేశాన్నివిడిచి వెళ్లిపోతున్నాను, ఈరాత్రే. నేను ఆశ్రమం తీసుకున్నాను. నాకూ యీప్రపంచానికీ ఏమీ సంబంధం లేదు. నీవు నన్ను మరచిపోవాలి."

"అల్లాగేప్రభూ," అంది కుసుమ నెమ్మదిగా. తరువాత "నేను వెళ్లివస్తాను" అన్నారు.

కుసుమ నిశ్శబ్దంగావంగి నమస్కరించి అతని పాదాలదగ్గరవున్న ధూళితీసి తలమీదవేసుకుంది.

ఆయన చరచరా నడిచివెళ్లిపోయారు.

చంద్రుడు అస్తమించాడు; రాత్రి మరింత చీకటైపోయింది. నీటిలో ఏదో...చ్...అని ఒకశబ్దం నాకు వినుపించింది.

"ఈ ఆకాశంమీదవున్న చుక్కలన్నిటినీ పూడేస్తాన్" అన్నట్లుగా గాలి రివ్వునవీచింది ఆచీకట్లో—

# కృష్ణునిగురించి మాకు దిగులుగా యుండెడిది.















## హార్లిక్సు ఎక్కువ బలము నిచ్చును

ఎదుగుచున్న బిడ్డలకు ఆటలయందేగాక పెరుగుటకుగూడ వారిబలము విశేషముగా వ్యయమగుచున్నది. ఈ పోయినబలమును తిరిగి పూర్తిచేయనియెడల, వారికి మిగిలియున్న సత్తువ తగ్గి, చికాకు పొడమి, శిథిలత జెందుదురు. హార్లిక్సునందు బిడ్డలకు కావలసిన పుష్టికరమైన పదార్థము లున్నవి.

దానిని బిడ్డలకు ప్రతిరోజా ఉదయము 9 గంటలకుగాని, రాత్రి పరుండునపుడు గాని ఇచ్చిన మంచి బలవంతులగుదురు. దానిరుచి బిడ్డలకు మిక్కిలి ప్రీతిగా నుండును. వెంటనే అది సత్తువను, దేహపుష్టిని చేకూర్చును.



## హార్లిక్సు శిథిలతనుండి కాపాడును

# ఆదర్శగృహిణి

శ్రీమతి పాకల రాజామణెమ్మగారు

ఇప్పటికి పదమూడు పదునాల్గు సంవత్సరములకుముందు నేను బెజవాడలో మాపిన తల్లిగారింట నున్నప్పుడు మాపొరుగున నొక వకీలుగారి భార్యకును నాకును స్నేహమయ్యెను. యువకులు మొదలు వృద్ధుల వరకు సహాయనిరాకరణోద్యమమున వెనుకంజవేయక యుద్రేకులై బనిచేయ మొదలుపెట్టుచుండినదినములవి. ఉద్యోగస్థు లుద్యోగములు వదలుచుండిరి. విద్యార్థులు విద్యాలయములు విడిచిపెట్టుచుండిరి. ఆవకీలుగారును తమ వృత్తినివదలి యుత్సాహముతో సహాయనిరాకరణోద్యమమున ప్రవేశించిరి. కారణాంతరములవలన నేనప్పుడా యూరువదలి మరల నాల్గుసంవత్సరములకా యూరుపోతిని గాని వారాయింటలేరు. నాకామెను జూడవలెనను యాశచేత వారుండు తావు తెలుసుకొని వారింటికిపోతిని. నన్ను చూడగానే యామె యాదరించి లోనికి తోడ్కొనిపోయి కూర్చుండబెట్టి కుశలప్రశ్నలైనతర్వాత "మీరా యిల్లువదలి యూరికింతదూరముననున్నారెందుకు. ఈ తోటా యిల్లూకొన్నారా"యని నేనడిగినాను. అందులకామె యీ నాల్గుసంవత్సరములలో జరిగిన తమ సంసారస్థితిగతులను వివరించి చెప్పెను. ఆసంగతులన్నియు స్త్రీలకాదర్శకరములుగనున్నవని వాటిని వివరింపబూనుకొంటిని.

"మా వారు సహాయనిరాకరణమున జేరి యుద్యోగముమాని చేతనున్న డబ్బంతయు కర్చుపెట్టిరి. ఆ వుద్రేకమంతయు చల్లారి యెవరిమట్టుకు వారు వేరువేరు మార్గము లనుసరించుచున్నప్పుడు మా సంసారముగడచు మార్గములేకుండెను. తిరిగి వకీలువృత్తి నవలంబించిన ధనమురాదు. అందువలన యేమియుదోచక నా భర్త ఖిన్నులైయుండిరి. నేను రెండువేల ఖరీదుగల నానగలను వారిచేతబెట్టి 'యిప్పుడు వేలమువేయుచున్న ఖాళీస్థలములలో నొకదానినికొని యక్కడ చిన్నయిల్లు కట్టండి. మనమచ్చట కాపురముండి మిగతధనముతో జీవనోపాయము చూచుకొందము. పిత్రార్జితమగు పొలములో పండివచ్చు ధాన్యము మనకు సంవత్సరమునకు సరిపోవును' అని ప్రోత్సాహపరచితిని. ఆయనట్లే యీ నేలకొని చిన్నయిల్లు కట్టినారు. దొడ్డిచుట్టూ ప్రత్తిచెట్లూ టెంకాయచెట్లూ వేయించి తక్కిన భూమిలో కాయగూరలు మొదలైనవి పెట్టించితిమి. రెండావులను గేదెను పాడికి కొనుక్కొనినాము. ఒక సంవత్సరమువరకు కొంచము కష్టపడినాము. ఇప్పుడు మాబిడ్డలతో మేము సుఖజీవనము చేయుచున్నాము. నేను వేకువనేలేచి పాచిపనులుజేసికొని పశువులకు మేతవేసి పాలు పిండి పెరుగుచిలికి వెన్నతీసి బిడ్డలకు చలిది

యన్నము పెట్టి వారి పనులన్నియు జేసి నేను స్నానము చేసి దేవతార్చన చేసుకొని వంట చేయుదును. నా భర్తగారును వేకువనే లేచి పెద్దకొమారుని సహాయముతో బావిలోని నీళ్లంతయు తోడి చెట్లకుపోసి ఆ వెనుక పిల్లలకు విద్య నేర్పుదురు. పిల్లలందరూ పాఠశాలకుపోయిన వెనుక మేము భోజనము చేసి రాట్నముపై నూలు తీయుదుము. పిల్లలు బడినుండి వచ్చిన వెనుక వారితో సంతోషముగా కొంత సేపుగడపి గృహకృత్యములందు నేనును తోటపనియందు వారును ప్రవేశింతుము ఇవి మా నిత్యకృత్యములు. మాయింటికగు కాయగూరలు మేమే పండించుకొందుము. పెరుగు పాలు నెయ్యి కొనవలసిన యగత్యము లేదు, సరిగదా మా కెక్కువగు పాల నిరుగుపొరుగు వారికి ఖరీదున కమ్మి యాధనమువలన పశువుల మేత కొనుచుందుము. మా పెరటిలోనున్న ప్రత్తిచెట్ల వలన కొంత దూది వచ్చును. అది చాలనందున కొంతకొని దానితో నూలు రాట్నముపై తీసి మాకు కావలసిన వస్త్రములు నేయించుకొందుము. మా బిడ్డలు యేకులు చేయుదురు. పిల్లలగుడ్డలన్నియు నేనే కుట్టుదును. నూనె మొదలగు కొన్ని వస్తువులు తప్ప మేమెదియు బజారునుండి కొనము. ఇందువలన యాడంబరముగ కాకున్నను యున్న వస్త్రములకు లోటులేకుండ శాంతముగ జీవించుచున్నాము. ప్రథమమున నా భర్తగారు యీపనులన్నియు మనము చేయగలమాయని భయపడిరి. వీరు ధైర్యముతో కార్యక్రమమునకు పూనుకొనుడు. రాత్రింబగళ్లు న్యాయశాస్త్రములు చదివి కష్టపడిన దానికన్న యిది యేమనకు సుఖజీవనోపాయము. ప్రస్తుతకాలపు నాగరికతా వ్యామోహము విడిచిపెట్టుడని వారికిబోధించి వారిచే యీవిధముగ జేయుట కొప్పించితిని. ఉప్పుడు కొంతధనముచేర్చి పెద్దయిల్లు కట్టించుటకు చూచుచున్నాము.”

ఇది యంతయు జెప్పి యామె నాకు యిల్లంతయు జూపించెను. పట్టణవాసులగు ధనవంతుల యిండ్లలోవలె వెలగల చిత్రవిచిత్రములగు విదేశవస్తు సముదాయము లేవియు లేకున్నను సంసారమునకు కావలసిన వస్తువులన్నియు వారింటనున్నవి. ఇల్లు చూచుటకు ముచ్చటగునట్లు పరిశుభ్రముగ నున్నది ఆమెకు ముగ్గురుపుత్రులు. ముగ్గురు పుత్రికలు. బిడ్డలందరు విద్యాభ్యాస మొనర్చుచున్నారు. ప్రతిగృహిణియు యీవిధమున భర్తలకు సహాయముచేసిన సంసారములందు దారిద్ర్యము కొంతతొలగిపోవునేమో. పాఠకసోదరీమణు లీకథ కల్పితమని యెంతురేమో. కల్పితముగాదు. జరిగిన కథయే. నేటికి పదిసంవత్సరముల నాటి సంగతి యిది. ఇప్పు డీ పుణ్యకుటుంబ మెక్కడనున్నదో నాకు తెలియరాలేదు. నే నాపూరువిడచినదిమొదలు ఆ ప్రక్కకు తిరిగిపోలేదు. ఎవ్వరినడిగినను వారిసంగతి సరిగా తెలియదని కొందరు వారావూర లేరని కొందరనుచున్నారు. ఈమె చరితము గృహిణుల కాదర్శమగునేమోయని వ్రాయ సాహసించితిని. ధనవంతులకు కాదుసుమండీ. సామాన్యులకు.

# ఒక కప్ 'టీ'
# మీ శ్రమ పరిహారము



బిడ్డలతో నాడుట కెంత ప్రియముండినను శ్రమనొందుట నిశ్చయము. వారికి వీర్యము హెచ్చు గనుక యన్నిటికిని మమ్ము లాగుచున్నారు. పోవకుండిన, వారికెంత యాయాసము గల్గుచున్నదో చూడుడు. అయిన, దానికొక యుక్తిగలదు. మీరు వారు యానందముగానుండుటకు నెమ్మదిగా కూర్చుండి "టీ" పుచ్చుకొనవలెను. ఈ శాంతమైన పానము శ్రమపరిహారమప్పుడే చేయును. కులాసగానుండుటకు "టీ"కి సమానమేదియు లేదు.



"టీ" జేయు క్రమము: శుద్ధమైన వేడినీరు. కొంచెము వేడిచేసిన శుద్ధపాత్ర. ఒక స్పూను "టీ" యొక్కొక్కరికిన్ని, మొత్తముగా నొక స్పూను యధికముగాను పాత్రములో వేసి, బాగుగా మరకబెట్టిన నీటిని పోయవలెను. 5 నిముషములు తాళి, కప్పులలో పోసి, పాలు, చక్కెర చేర్పవలెను.

## సంసారసుఖము — ఇండియా "టీ"

1 K-30 RS.

# మింగ మెతుకులేదు – మీసాలకు సంపెంగనూనె

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

*మన ఆచారాలు చాదస్తం. వాళ్ల అశుచిప్రవర్తనా లామోదము. తడి, రొడమ, మడి మైలలేదు. సకల క్రిమిసంహారిణియగు పసుపుమోటు. సుద్దగుండతో చేసిన సువాసన పౌడములందము. ఇంతకూ వాళ్లధికారులు. మనంబానిసలము. ఆ నీచత్వముతొలగితేకాని, శుద్ధమాతృత్వము సిద్ధించదు.*

ఇరవైయవ శతాబ్దములో నేటి నవనాగరికముపై యేడో సంవత్సరములో పై హెడ్డింగులాగున్నాయి కుటుంబాలు. కాఫీత్రాగుడు మొదట స్టూడెంట్లనాశ్రయించి, క్రమేణా ఉద్యోగస్తులను, తదుపరి ఆహితాగ్నులగు పెద్దలను, మహాలక్ష్మీ పూజాధురంధరులగు అమ్మలను, ఇంకా వితంతువులను, మరిన్ని ఏకాదశీవ్రతము లవలంబించు ముసలమ్మలను, పిమ్మట పాలుచాలని పసిబిడ్డలనుకూడ, (ఎపిడెమిక్)లో వేయుమందులాగ, అంటువ్యాధిలాగ, ఆబాలగోపాలము ఆశ్రయించి బంధులతలా పాకింది. ఈ త్రాగుడు అలవాటైయాక, శాస్త్రాలు మారాయి. నీమాలు నామావశేషమయాయి. పూజలు వ్రతములు బూజుపట్టేయి. ఆకలితో చేయువ్రతములు భక్తితో కూడియుండవుట. ఆత్మను మాడపెట్టకూడదుట. అందుచేత, తృప్తిగా, పుష్టిగాపుచ్చుకొని స్నానంచేసి జపతపహోమాలు ఆఖరికి అర్ఘ్యాలుకూడా పెట్టుచున్నారు. ఆహా! కలిమహిమ. కాఫీమహిమ. అణాగణనలేని కుటుంబములో, పూటకు టికాణలేని కుటుంబములో, దాటిగా కాఫీదుకాణము. అదదానికి గంపంతపని. వంటంత చాకిరి. పోసుకునేవి గ్రుక్కెడునీళ్లును, త్రాగేందు కైదుగ్లాసులు. ఎడ ఒడి బిడ్డలుంటే, పాడిపంట ఇంటయున్న యిల్లాలీ కాఫీచాకిరీ చేస్తుందా? సంసారకృత్యాలే చేస్తుందా? పైగా సంవత్సరాని కొకనిగు గ్రాసము, నెలకొక సంసారం. కాఫీఖర్చెకవుతుంది. నల్లమందులా అంటుకున్న దీన్ని వదలలేరు సరికదా. మిగతా పోకఖర్చులో? వీటివిమర్శన కావాలంటే, జరుగుతూయున్న సంసారాల్లోని యొక కుటుంబకథ చెబుతాను వినండి.

రామారావొక సంపన్నగృహస్థుడు. పట్నంలో కాపురము. స్వంతమొక చిన్నయిల్లుంది. నల్గురాడపిల్లలు. ఒకటి, రెండు, ఇద్దరు మగపిల్లలు. వచ్చేరాబళ్లతో చిన్నసంసారంగా యున్నపుడు సుఖంగా రోజులువెళ్లాయి. పిల్లలు ఎదిగినకొలది కుండెదిగినది. ఆదాయమంతేకాని వ్యయమెక్కువై క్రమేణ మబ్బులోదూరే చుక్కల్లాగ ఒక్కొక్క ప్రతే అస్తమించాయి. చివరకు మిగిలిందిల్లు. దానిపై అప్పుతీసి వర్తకముపెట్టాడు. బ్రాహ్మణవ్యవసాయము, కాపవర్తకంలాగ పెట్టుబడిమింగేసి, పైగా అప్పుతేల్చిందా వ్యాపారము. దాంతో ఇంటావిడవంటిమీది గుల్లలెగిరాయి.

ఇన్నిపోయినా, మగపిల్లల హైస్కూలు చదువులు, ప్రయివేట్లుపెట్టుకొని చదువుకొనుట మానలేదు. రెండుసార్లు టి, కాఫీ, ఫలహారాలుమానలేదు. ఇంకాయున్న ఆడపిల్లలనుకూడా పెద్దచదువులకు దూరారాతం స్కూలుకు బళ్లపైపంపి చదివించు

చున్నారు. ప్రయిబేటుమాస్టరుకు, బండివానికి జీతా లరువు. తిండిసరుకులకు పరేషాని. అణాయించేవాలు. రేషనుబియ్యం కొనుక్కొని సర్దుకుని యింతన్నంతించే నయమా ? లేక, ఏచికరీ కాఫీబిళ్లలో కానివికొని, అర్ధణా పంచదార తెచ్చుకొని ఏవీధిలోపోతున్న మేకనో పట్టుకొని యిన్నిపాలు దొంగతనంగా పితుక్కొని, అపూటకా కాఫీకాచుకొని త్రాగేయడమే. దాని ఒడి ఎందాక ఉంటుంది, పదిగంటలదాకానే. అన్నగతంప్రాణం. పద్దెయాటప్పటికే విలవిల్లాడుతుంది. మరి బయల్దేరుతుంది అమ్మగారు. బియ్యం బదుళ్లకిరుగిళ్లకు. ఇచ్చినవారు మరివ్వరు. అలా సాధ్యమైనంతవరకా వీధంతా బదుళ్లే. ఒక్క బియ్యమయితే ఎలా? ఆధరువులో నెయ్యి, నూనె, చింతపండు, మిరపకాయ, సాయంకాలమయేసరికి కిరసనాయిలు. వీలయితే రొక్కం. ఈలా చెప్పించిచెప్పకుండా, దీనత్వం కనబడకుండా, అడిగినచోటడగకుండా చేస్తారప్పులు. తీర్చితే వీలయితె తీరుస్తుంది. లేకపోతే కఠినహృగ్గృహిణులచేత చీవాట్లుతిని, మాపని రేపని అడిగించుకుంటూ అవమానాగ్నికి కింధనమగుచు సంచరిస్తుందా యిల్లాలు.

ఇహా మగాడిఘాటి చూడండి. లేచిందే పనిగా పెంటతిరుగుళ్లుతిరిగి యింటికొచ్చేసరికి వంట అవకపోతేను, పదార్థాలు సరిగా అమరకపోతేను కేస్తాడు కేకలు. ఏమిచెప్పను. వట్టిగొడ్డు కార్పు లెక్కవన్నట్లు తానే మగాడిలాగ చేస్తా దానిదమీద అధార్టి. జవాబిస్తే తోకతొక్కిన తాచే. కొడతాడేమో కూడాను. ఎంతచచ్చు పెద్దమ్మకైనా పెళ్లాం లోకువని అభిప్రాయం.

మరి వాళ్లపిల్లల సంగతేమిటంటే స్కూలు కెడుతుంది గనుక, పంతులమ్మ ఆక్షేపించకుండా తరహా తమాషా చీరలు, బాడీలు, జాకెట్లు, వదులుజడల్పై అర్ధణా పూలదండ, బొట్టు కూడదు, కళాయిచేసిన పళ్లెంలా సబ్బుతోరుద్దిన ముఖం, పొడుగ్గా బుజాలదాకా వేలాడేలోలకులు, గాజుపూలతోనైనా సరే. సబ్బుతోరుద్దాక, పూసుకునేటందుకు పౌడరో లేక అదేమిటో వెన్నలాగుండేముద్ద, దానిపేరే రావటం లేదు. స్నోలు. మలామాచేయాలి. ఇంట్లో పని ముట్టుట నామర్దా. నాజూకుకు లోటు. ఆడపిల్లింటి చేదోడువాదోడుగా తల్లికి అన్నీ రోజులుకూడా వెళ్లాయి నేటికి. ఆడపిల్లంటే తల్లికెంతో ఆసరాగా యుండేదిటపూర్వం. ఇప్పుడా అమ్మాయికూడా విద్యార్థి అవడంచేత, తల్లిపాట్లా ధాతకే తెలియాలి.

ఆడపిల్లలపోకు లీలాయుండగా మగపిల్లల ప్రశ్నే చాలటంలే దెక్కడాదాయింకూడా. తర్డుక్లాసు వెధవకీనూడా నూటే కావాలి. వాళ్లింట్లో ఓ చవటకొడుకున్నాడు. చదువురాదు. అంటే తెలివితక్కువవాడు కాదు. అఖండుడే. అయితే ఆటలు మరిగి చదవడు. కాళిదాసు బాల్యస్థితే వాడిది. ఒక్క చదువే లేదుకాని. మీసాల మెరుగులెన్నో యున్నాయి. ఏబంధువులో ఏరూపాయో యిస్తే, చిరుగుచొక్కాలకు టాకీలువేసి తొడుక్కొని, సువాసననూనెలు, సబ్బులు, రైలుపెట్టెలలోని సకల రోగనివారిణౌషధాలు, అపరాధపరిశోధకనవలలు కొంటాడు. ఏమైనాయుంటే, తుపానుమెయిలు, దొంగలనాయకుడు లాంటి సినీమాలు చూస్తాడు. ఇంటిసంగతెంతచెప్పినా వంటబట్టదు. తల్లిరోదన, బోధనకూడా బూడిదలోపోసిన పన్నీరేఅయింది. డబ్బులేని మగవానికి కోపమెక్కువన్నట్లు ఇంటి చిరాకు ఎక్కువై యజమాని కొక్కప్పుడు శివమెక్కుచుండును. పిల్లకాకికేం తెలుసు నుండేల దెబ్బన్నట్లు, తండ్రి కష్టసుఖాలు తెలియని పిల్లలప్పులుచేసి సినీమాలు చూస్తారు.

ఇల్లాచదివి, అల్లాతిరిగి చివరకు చెడిపోయారు పిల్లలు. మర్యాద మీరారు. తల్లిదండ్రులను ధిక్క

రించుచున్నారు. ఇంటిఅప్పు పెరిగింది. అప్పులవాళ్లు కాచేశారు. అద్దెకొంపలాశ్రయించారు. అద్దెలివ్వలేకపోతే ఉన్న చెంబుతప్పేలా మంచం కోయ్యలు పట్టేశారు ఇంటివారు. నెలకొక కొంపగా తిరిగితిరిగి చివరకు సత్రవుల నాశ్రయించినారు. కాని శేషాలు మారలేదు. షోకులు మానలేదు. చాలా మందికి చిల్లరిమల్లరి రుణాలుండిపోయాయి. తిట్లతోను, చివాట్లతోను మనోదేహాలు క్రుంగిపోయాయి తలిదండ్రులకు. మనోవ్యాధికి మందు లేదని మంచము పట్టారు దంపతులు. పూలమ్మిన యూరనే కట్టెలమ్మారు. కొన్నాళ్లు స్నేహితులు కనిపెట్టారు. బంధువులని తెగతిన్నవాళ్లు మరుగైయారు. ఇన్నైనా, వాళ్లసీత జడలోకి పూలుకొనుట, రకరకాల చీరలు కట్టుట మానలేదు. ఎట్లు అమరుచున్నవో భగవంతునికి తెలియాలి. మనకు తెలియదు.

మరిగి మరిగి కొన్నాళ్ల కాదంపతులస్తమించారు. కుటుంబములో దారి, ఎవరికివారే యమునాతీరే అయింది. అక్క నాశ్రయించింది చెల్లెలు, అన్న నాశ్రయించాడు తమ్ముడు. ఉదారహృదయుడగు దీనబంధుడగు బంధువాడ వారి కాశ్రయదాతైనాడు. మగవాడికే కాఫీహోటలులోనో చిప్పలుకడిగే స్థితి కలిగింది. చూచారా, వాళ్ల పొరబాటులో అలవాట్లు.

ఇల్లా రకరకాలగా పైపటారం లో లొటారంగా యెన్నో గృహాలున్నాయి. డిప్రషనంటూనే, సినీమా కంపెనీలు, కాఫీహోటల్సు, జాడీబీడి షాపులు, తాగుడుశాలలు, పైపై మెరుగుల్లు ప్రకటనలు ఎక్కువగుచు చేయున్నవి. కష్టమున్న అధిక మవబట్టేకదా అన్నివిధాల దుబారాలు ఎక్కువగుట. ఇక ఆర్థిక దుస్థితి ఎవరిది. మా స్త్రీలది. అందులో గృహిణికి, ఎజమానికి, బిడ్డలకి అన్నీ పాగును. ఇల్లాలు నిర్భాగ్యురాలు. ఇంతటి హిందూగృహిణీ నిర్భాగ్యత్వానికి కారణము పరదేశభాషాసంపర్క సంభ్రమమే కారణము. పొరుగింటి పుల్లకూరరుచి. దూరపుకొండలు నునుపు. తల్లిమాట లపనమ్మకము. మాతృవిద్యలో మార్కులు ముప్పై. ఇంగ్లీషులో ఎనభై. ఇల్లా సవతిబోధన లెన్నోయున్నాయి తర్కించాలంటే.

మన ఆచారాలు చాదస్తం. వాళ్ల అశుచిప్రవర్త లామోదము. కుడియెడమ, మడిమైలలేదు. సకల క్రిమి సంహారిణియగు పసుపుమోటు సుద్దగుండతో చేసిన సువాసపాడుములందము. ఇంతకూ వాళ్లధికారులు. మనం బానిసలము. ఆ నీచత్వము తొలగితే కాని శుద్ధమాతృత్వము సిద్ధించదు.

మరొకసంగతి. మంచిమార్పులు కలగాలంటే శాస్త్రములు విధించిన బ్రహ్మచర్యం విద్యార్థిదశలో నడపితీరాలి. పైనరబ్బాయి నడవవలసిన ధర్మాలు రాజ్యనిర్బంధశాసనాలవాలి. చెడ్డనడవళ్లు గలసిన నాటకాలాడకూడదు. ఆడిన బాలురెంత మాత్రమవి చూడకూడదు. పిల్లవాని నోట్లా సిగరెట్టు చూచినంతమాత్రాన శిక్షానిర్బంధాలుండాలి. పూర్వకవుల శృంగారప్రబంధాలు, అవుటాఫ్‌ప్రింటులాగ మాతృరూపిణులైన స్త్రీల చిత్రములను, వికారాకారవస్త్రవిహీన అపసవ్యంగా చిత్రించకుండగా చిత్రలేఖకులను, ఆవకతవక అనాథకవిత్వముచే నాటకాలు నవలలు వ్రాయకుండా కవులను, అట్టివి చదువకుండా యువకులను నిర్బంధించాలి. ఇంతకు ఇన్ని మన సదుపాయాలు, మన బాగులు ఎవరికి కావాలి. బిడ్డలాగు తండ్రికి తల్లికి కావాలి కాని పరాయివాళ్లకేమి. అల్లాగే స్వతంత్రరాజ్యములోని ప్రజాసదుపాయాలు, బాగులు మన కేలావస్తాయి.

అయినా మనలో మనమే విమర్శించుకొని, మోసాల సంపెంగనూనె జీవితాలు విడచి, సంసారం గుట్టుగా బ్రతికనేర్చుకొనుటే బాగుపడుటకు దారి. ఇదే దేశమాత ఆక్రోశము. దీనిని నిర్వర్తించి తల్లి గౌరవం నిలబెట్టువారే తగిన తనయులు కాగలరు. కొరగాని కొడుకు తల్లికి కడుపుచేటు.

# రాజపుత్ర ప్రశస్తి

విద్వాన్ విశ్వనాథ నరసింహముగారు, బి.ఏ.,బి.యిడి.

శా. స్వాతంత్ర్యంబన "జన్మహక్కు"నెడి వాచారూఢి జాటించు వి
ఖ్యాతింబొందిరి రాజపుత్రులు బలాయుత్తంబుగా రాజ్యముల్
శాతాసిం బరిపాలనక్రమ విచక్షుంబూని సద్వైభవో
పేతంబౌ చిరకీర్తిగాంచిరి రణావిఖ్యాత శౌర్యోద్ధతిన్.

ఉ. ప్రాణముగడ్డిపోచ, సమరావని వెన్నిడరాదటంచు పూ
బోణులు పాలతో గలిపిపోయుదురా రసపుత్రులందు, సిం
గాణినమర్చి యాహవముఖంబున దోర్బలశత్రు సద్భట
శ్రేణులనేని గెల్వఁగల చేడియలున్ గలరంచు నెంచుడీ.

గీ॥ తాతగారిది ఆజ్మీరు భూతలంబు
కాలమున ఢిల్లిప్రభునకు గలసిపోయె
పృథ్వీరాజును వీరాధివీరుఁడనుచు
జనములెల్లరు కొనియాడ సాగిరంత.

చ. చిగురులగున్నమావి, వికసించిన యెఱ్ఱగులాబిపూవు, మై
జిగిసొగసుందనమ్ము విరజిమ్మడిరాసుత, పృథ్వీరాజు సో
యగమువినంగ నాతని ప్రియమ్మునఁ దావరియించె నెమ్మదిన్
పగవగలెంతురే వలపుపండిన తావుల సుందరీమణుల్.

చ. జనకుని వైరిబొందె, కడుసాహసవృత్తిదురంబు భర్తతో
డనుపచరించె మ్లేచ్ఛులు హుటాహుటిపర్వులిడంగ నంతటన్
వెనుక కటారిపోటుబడి పృథ్వీ విభుం డసువుల్ దొఱంగ నే
గెనె దివికామెగూడ, సతికిం బతితోడిదలోకమౌగదా.

చ. జయము పరాజయమ్మును యశంబును దుర్యశమున్నిమిత్తమే
భయదరణాంగణమ్మున జవమ్ము బలమ్ము పరాక్రమమ్ము జూ
పి యుభయపక్షముల్ సమరవీరమునన్ జరియించెనంచు, తా
నయువినయోక్తులం బృథివినాథుఁడు పల్కుట రాచపాడియే.

మ. తనచేఁజిక్కిన సాటిరాజనుచు చెంతంజేర్చి మన్నించివీ
డెను గోరీ నలపృథ్వీరాజు, తనవాడిం గైదువుంబూని నీ

తినివర్జించి నిజోద్యమంబు పగసాధింపంగ రాజ్యంబుగె
ల్చెను మ్లేచ్ఛావనిపాలకుండు, తనదుర్నీతిన్ జయంబబ్బఁగన్.

శా. సందేహింపబనేమి శాశ్వతము మ్లేచ్ఛాధీనముంజేసె తా
హిందూరాజ్యము పృథ్విరాజనుచు నిందింపంగనౌ నాజిలో
ముందేజిక్కిన వైరిపీడెనకటా! మోదానుసంధాయి తాఁ
బొందెన్ శాతకరాసిఘాతమురిపుల్ బొందంగ హిందూరమన్.

మ. బలవంతుండగు నాయకుండు చనినన్ బాహాబలంబొప్ప మ్లే
చ్ఛులు యుద్ధావని గెల్వజెందిరనఁగాఁ జోద్యంబె, ఆవెన్క బం
ధులనాశంబు కలంచివైచె జయచంద్రుణ్, వానిరాజ్యంబు వై
రులపాలంబడి యంతరించె, రసపుత్రుల్ దీనులై నిల్వఁగన్.

గీ. పిదప గోరీమహమ్మదు విదితరాజ్య
రమవహించె డిల్లీని, నిరంతరముగ
ఆముసల్మాన్ల పాదుషావైరిగాదె
తరలిపోయెను రాజపుత్రప్రశస్తి.

---

## అసహాయత

వం. రామారావుగారు
(రవీంద్ర సారస్వతసమాజం)

అది యూహింపలేని వాతావరణము
తేల్చుకొనిపోవుచున్నదో! దేవ! నన్ను
ఒక్కచో నిల్పుమన్న నేనుండలేను
ఈవు కృపజూచి చేయూఁత నీయకున్న!

అెక్కల్లల్లార్పకుండియు లెక్కలేని
దూరతీరాల కారీతి చేరబోవు
పక్షినై పోదునేమొ! నాబ్రదుకు నాకె
గూఢమైపోయె! తెలియదే కొంచెమేని!

నేను విహరింపనున్న దేదేని వెలుగో!
గాఢజీమూతపటలమ్మొ! గహ్వరమ్మొ!
ప్రవిమలానందసీమయో! రౌరవమ్మొ!
త్వేళవహ్నియొ! ఇంక నెవ్విధమొ! దేవ!

గాఢవాత్సల్యమూర్తి! నిన్ కలుసుకొందు
నో! దిశలతుదలందుండ పోదునేమొ!!
'కాలవాహిని' బడియెట్లు గాగనుందొ!
భావిచరితమ్ము లే తాళ్లపాలో! నాకు!

నీవు కృపజూడకున్న మన్నింపబడను
ఈవు సాహాయ్యపడక జీవించలేను
నేను నీవున్ననుందు లేవేని, లేను!
అర్థమాయువు నీయందయర్పణమ్ము
నేసినీమ్రోల 'శరణం'చు చెప్పికొందు.

# * * దైవమేమిచేసినను మన మేలుకొరకే * *

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

జనార్దనరావొక ప్లీడరుగుమస్తా. రాధ జననముతోడనే యీతని ప్రథమ భార్య గతించెను. తోడనే రాధ ఆమె మాతామహుల యింటికిగొని పోవబడెను. ఇట్లు బిడ్డయాటంకముగూడ తీరుటచే జనార్దనరావు నిస్సందేహముగ ద్వితీయ భార్యాస్వీకరణ మొనరించెను. యిట్లుండ పాపము రాధ దురదృష్టముచే మాతామహియు మాతామహుండును కొంచెమించుమించుగ నేక కాలమందే మృత్యువువాతబడిరి. గత్యంతరములేమి జనార్దనరావు కుమార్తెను తన యింటికి తీసుకొనివచ్చి రెండవభార్య కప్పగించెను. లోకరీతి సుబ్బలక్ష్మియు రాధను విమాతాసహజమగు ప్రేమతో జూడ జొచ్చెను. సుగుణఖనియగు రాధ సవతి తల్లి పెట్టుబాధలనెల్ల నోర్పుతో సహించుచుండెను. భార్యాలోలుడగు జనార్దనరావు రాధకుగలుగు పాట్లను గాంచియు నేమియు ననలేక యూరకుండెను

ఒకదినము వీరి యింటియందు పగలు పదిగంటలగుసరికి జనులు నిండిపోయియుండిరి. జనార్దనరావు ద్వితీయభార్యా సంతానమగు రాము శవము నూతనుండితీసి పైన వేయబడియుండెను. అందరి కండ్లనుండియు అశ్రుధారలు కారసాగెను. ఇక తలిదండ్రుల దుఃఖము వ్రాయ నలవికాదు. అందు సుబ్బలక్ష్మి దుఃఖముచూడ శక్యముగా కుండెను. ఇంతలో పోలీసువారువచ్చి పంచాయితీజరిపి ప్రమాదవశమున కాలుజారి పడినట్లుగ తీర్పుజెప్పి పెద్దమనుష్యుల చేవ్రాళ్లుగొని ఉత్తరక్రియల కనుజ్ఞయిచ్చి వెడలిపోయిరి.

సాయంత్రమారుగంటలగుసరికి యిరుగు పొరుగువారందరును సుబ్బలక్ష్మిని పరామర్శించుటకై రాసాగిరి. సహజముగా నెవరికైనను యోదార్పుమాటలు విను కొలది దుఃఖము హెచ్చుచుండునుగదా! అట్లే సుబ్బలక్ష్మి దుఃఖమీయోదార్పువచనములచే యతిశయింపదొడగెను. "రాధా! ఊరుకొనుమమ్మా! నీవుకూడ నిట్లేయేడ్చుచున్న నింక మీపిన్నినోదార్చువారెవరు?" అనుచు నొకయువతి విమాతతో సమముగ దుఃఖించుచున్న రాధనుగని పల్కెను. "చాలు చాలు చేసినపని చాలక యింకను దొంగయేడ్పులేల?" అని సుబ్బలక్ష్మి రాధను చురచుర జూచుచుబల్కెను. దొంగయేడ్పులేమి వదినా! యని రాధను మందలించిన యువతి సాశ్చర్యయై సుబ్బలక్ష్మిని దిలకించుచుబల్కెను. అచటజేరిన యంగనలెల్లరు సుబ్బలక్ష్మివైపు నిర్భ్రాంతలై దిలకింపనారంభించిరి. అంత సుబ్బలక్ష్మి రూక్షస్వరముతో చేతులు త్రిప్పుకొనుచు "అయ్యో!

మీరు దాని దొంగయేడ్పుం గాంచి మోస పోవుచున్నారుగాని దాని రాక్షసకృత్యముల నెరుగరు. పసిబాలయనియే దలచుచున్నారు గాని గోముఖవ్యాఘ్రమని యెరుంగరు. నిన్నటిదినమేదో తప్పుపనిచేసినందున పెద్ద దానిని యూరకోనలేక కొలదిగ శిక్షించితిని. అందుపై నాపైన పగబూని నోరెరుగని పసికూనను నూతద్రోసిన రాక్షసి. లేకున్న యెన్నడును నూతివద్దకుబోవని నాబిడ్డ బావి యనిన భయపడునాబిడ్డ నూతబడుటయేమి? కడుపుచించుకున్న గాళ్లపై బడునని దీని దుశ్చేష్టల నింతవరకు భరించితినిగాని కడుపు తీపి నేడు వెల్లడించినది. చేసినపనికి సిగ్గుపడక దుఃఖసటనలెందులకు? యిట్టి ఘోరరాక్షసిని పసిబిడ్డల జంపుపాతకి నింటనుంచుకొని యేసాధ్వి భరింపగల'దని బల్కెను. పాపము రాధకు మిన్నువిరిగిమీదబడినట్లాయెను. యే పాపమెరుగని తనపై నిట్టి ఘోరాపనిందను పిమాత మోపుటగాంచి యామెగుండె వ్రేలి పోయెను. పై మాటలనువినుచు నారాధస్మృతి విహీనయై నేలబడిపోయెను. సుబ్బలక్ష్మి యెడగల భీతిచే యేరును ఆమెదరిచేర సాహసించరైరి. గాని "పదమూడేండ్ల పసికూన పైననా యిట్టి దురపవాదము మోపుట. సవతికూతు నిలువెడలగొట్టవన్నిన పన్నికయే గాని వేరొండుగాదు. దైవవశమున గల్గిన విచారము నిటుపశమింప జేసికొనుచున్నది. యెంతటిగయ్యాళి" యని యనుకొనుచుఁ వచ్చినవారందరును యెవరిండ్లకు వారు వెడలిపోయిరి.

రాత్రి 11గంటల సమయమయ్యెను. జనార్దన రావుగారి వీధితలుపులు తెరువబడెను. "యీ యర్ధరాత్రమందా పోనిమ్ము. రేపుప్రొద్దుననే పంపివేయగూడదా" యని జనార్దనరావు పల్కుచుండ "వీలుపడదు. పసిసిసువును పొట్టనుబెట్టుకున్న పాతకి నింకను నింటనుంచు కొన మీ మనసెట్లొప్పుచున్నది? యిది యింకను నింటనున్న నింకను నెంతటి ఘోర కార్యములైన నొనరించును. యింక వెళ్లు తల్లీ! మాకు శనిగ్రహము వదలు"ననుచు సుబ్బలక్ష్మి వెక్కి వెక్కి యేడ్చుచున్న రాధను బైటకుద్రోసి వీధితలుపు గడియ వైచెను.

తగినపోషణలేక సౌందర్యమించుక వన్నె తగ్గియుండినను రాధమోము చూపరుల హృదయము నాకర్షించునంతటి మార్దవము గలిగియుండెను. నాడు అమావాస్య. యెల్ల యెడల గాఢతిమిరము ప్రబలియుండెను. అంతట నిశ్శబ్దదేవత తాండవించియుండెను. అట్టి యా గభీరనిశీథిని పదుమూడేండ్ల ప్రాయపు బాలయగు రాధ శుష్కించిన దేహములో గంపించుచున్న హృదయముతో దైవముపై భారమువైచి ముందుకుబోవ సాగెను. ఆ నిస్సహాయబాలిక దీనస్థితి గాంచి కఠినమగు మానవసంఘముపై తమ కోపాగ్ని వెల్లడించుచున్నవో యన తారకలు ద్విగుణముగ ప్రకాశింపజొచ్చెను.

సుందరరావు కాపుకులస్థుడు. పేరొందిన న్యాయవాది. మంచి సంఘ సంస్కర్త. కరుణాహృదయుడును లక్ష్మి

పుత్రుడునగుటచే నీతడు తలంచిన కార్యములు జయప్రదముగ కొనసాగి ధనముతోబాటు యశోధనమునుగూడ వర్ధిలసాగెను. పతిభక్తిపరాయణియు, జాలిగుండెయు గల జానకమ్మ సుందరరావుగారికి తగిన సహధర్మిణియని పేరుగాంచెను. సహజసద్గుణ సంశోభితుడగు కృష్ణారావు వీరికి పుత్రుడై బంగారమునకు దావి యబ్బినట్లు ప్రకాశింపజొచ్చెను. కృష్ణారావు ఆ సంవత్సరమే మెడికల్ కోర్సు పూర్తిగావించెను. పుత్రునితోను భార్యతోనుగలిసి సుందరరావు పట్నమునకు దాపుననేగల తమ స్వగ్రామమందున్న బంగళాలో వేసంగి సెలవులు గడుప ప్రవేశించెను.

రాత్రి ఒంటిగంట దగ్గరగావచ్చెను. జబ్బుగానున్న తన స్నేహితుని జూచి తిరిగి యింటికి కృష్ణారావు సైకిలుపై వచ్చుచుండెను. తమ బంగళాగేటుదరికి వచ్చుసరికి 'హా' యను కంఠమును దబ్బున క్రింద నేదో భారపదార్థము పడిన శబ్దమును కృష్ణారావు వీనులకు సోకెను. ఆశ్చర్యచకితుడై కృష్ణారావు చటాలున సైకిలునుండి దిగి శబ్దము వినబడినవైపు టార్చిలైటు వెలిగించి చూచెను. క్రింద సౌందర్యవతియగు నొక బాలిక స్మృతివిహీనయై పడియుండెను. ఆమె పాదములదగ్గరనుండియే నొక వృశ్చికము జరజర నడిచిపోవుచుండెను. వెంటనే జరిగిన సంగతిని గ్రహించి కృష్ణారావు తన పాదరక్షచే దానిని పంచత్వము నొందించి అసహాయయై క్రిందబడియున్న బాలికను తన చేతులపై నిడికొని దాపుననేయున్న తమ బంగళాలోనికి గొనిపోయెను.

బాలభానుని లేతకిరణములు గవాక్షముగుండా పర్యంకముపై బరుండియున్న రాధ ముద్దుమోముపైబడి ఆమె ముంగురులతో గలిసి నాట్యమాడ జొచ్చెను. చల్లని పిల్లవాయువులుగూడ గవాక్షముగుండా లోనికి జొచ్చి రాధ మోముపైగల ముంగురుల నెగురగొట్టుచు కమలబాంధవుని కిరణములతో కలహింప నారంభించెను. వీటి కలహముచే రాధకు మెలకువవచ్చి విస్మయదృష్టులతో నలువైపుల జూడసాగెను. తానున్న దొక రమ్యమైన గదియనియు తానొక మృదుపర్యంకమున బరుండియున్నట్లు రాధ గ్రహించెను. మెల్లమెల్లన జరిగిన సంగతులను రాధ జ్ఞప్తికి తెచ్చుకొనసాగెను. ప్రస్తుతము తానున్న స్థితిని దలంచుకొని విభ్రాంతయై చటాలునలేచి కూర్చుండెను. వెంటనే ప్రక్కను గూర్చున్న జానకమ్మ రాధను వారించి కుమారీ! లేవవలదు. నీకేమియు భయములేదు. ప్రస్తుతము నీవు సురక్షితప్రదేశమునందేయున్నావు. ఇచ్చట నీ లాలనపాలనముల కేమియు లోపము గలుగదు. నిర్భీతచిత్తవై పరుండుము. నీ కింకను నిదురమత్తుపోలేదు'' అని ప్రేమ చిప్పిలునట్లు పల్కెను. ఆ సుధీమయ వాక్కులు వినినంతనే రాధ కంటకన్నీరు నిండిపోయెను. వెంటనే రాధ మారుమాటాడక సెజ్జపై బరుండి నిద్రించెను.

రాధ శరీరస్వాస్థ్యము బడసిన వెనుక తన తన చరిత్రనంతటిని జానకీ సుందరరావులతో జెప్పి విచారింప నారంభించెను. కరుణా హృదయులగు నాదంపతులు రాధ హృదయ విదారకచరిత్ర నాలించి ఆమె నిస్సహాయ స్థితికి వగచి, ఆమెను తమయొద్దనే యుంచు మనియు, ఆమెను తమ కన్నకుమార్తెవలెనే ప్రేమింతుమనియు చెప్పిరి. కన్నతండ్రి గలిగి యుండియు విమాతచే వెడలగొట్టబడి విశాల ప్రపంచమున "నా" యనువారు లేకయున్న తన కిట్టి సాధుజనాశ్రయము కల్పింపజేసి నందులకు పరాత్పరునకు వందనములర్పించుచు, రాధవారి కోరికప్రకారము వారి యింటనేయుండ సమ్మతించి వారి యనువర్తియై వినయముతో మెలగసాగెను. వెంటనే సుందరరావు రాధ నొకస్కూలులో ప్రవేశ పెట్టెను. సహజముగా తెలివిగలవియగుటచే రాధ ప్రతితరగతియందును జయము గాంచుచు విద్యాభివృద్ధి గావించుకొనుచుండెను. కృష్ణారావునకు తన దలిదండ్రుల యౌదార్యమున కానందమును, రాధ సౌందర్య సౌశీల్యముల కాశ్చర్యమును కలిగెను.

నాలుగేండ్లు గడచెను. పత్రికలలో వర్ణాంతరవివాహమను శీర్షికతో రాధా కృష్ణుల ఫోటోలతోకూడ ప్రకటింపబడెను. సంఘసంస్కర్తయగు సుందరరావు జాతిభేదములను పాటింపక రాధ సుగుణములకు కట్టుబడెను. అదివరకు అన్యోన్యానురాగ పూరితులగుటచే రాధాకృష్ణులకు వివాహ మొనరించెను.

నాడు పౌర్ణిమ. రేరాజు షోడశకళా ప్రపూర్ణుడై నభోమండలమున తారకాజన పరివృతుడై వెలుగొందజొచ్చెను. వాణీవిలా సోద్యానవనమున నిరువురు యువతీయువకులా చల్లని చంద్రికాకాంతులలో సుఖ విహారము సల్పుచుండిరి. ఉద్యానవనమున గల పుష్పరాజములు సుగంధముల నీనుచుండెను. చల్లని మలయమారుతము వీచుచుండెను. అట్టి ప్రశాంతానందసమయమున నా యువతీయువకుల నోటినుండి మృదు మధురవాక్కులు వినబడెను.

"రాధా! ఆ దినమట్లు మా పిన్ని నిన్ను వెడల నంపుటచేగదా! నీయట్టి సుశీల నాకు భార్యగా లభించినది."

"నిజమే! ఆదిన మట్లు మాపిన్ని నన్ను యిలువెడలనంపకున్న మీవంటి సుగుణ రాశి నాకు భర్తగా లభించియుండునా? ప్రాణేశ్వరా! దైవ మేది గావించినను నది మన మేలుకొరకేగదా!"

---

## గమనిక

గత సంచికయందు ప్రకటింపబడిన 'సంఘ సంస్కరమా!...' వ్యాసకర్త శ్రీయుత జి. జోగారావుగారు కాని జి. గోపాలరావుగారు కాదని పాఠకులు గమనింప గోరుచున్నాము.

సంపాదకుడు

# కాశ్మీర మజిలీలు

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు.

(బంగారు గుడి 3)

కనకకాంతితో సహకరించి, సౌందర్యలహరితో వియ్యమంది, మధురగానఝరి అద్భుత త్రివేణిని సృష్టించి, స్వర్ణమయ ప్రదేశమున దివ్యభావవీచికల నువ్వెత్తుగ నుప్పొంగించెను. మానససరోవరమందలి కమలసౌందర్యమున మున్కవేయు మానసౌకమువలె నా మనసా పవిత్రపూరమున గ్రుంకులిడెను.

కొంతసేపట్లే గర్భాలయమున గూర్చుని యుంటిని. అంతకంతకు గాయకు లావేశభరితహృదయులై పాడుచుండిరి. భజనలోని లయననుసరించి నాయాత్మ దేవశైలూషివలె నృత్యమొనరించినది. మురళీధరునకు హృదయము నప్పనమనిన వ్రజవాసివధువున నంతరంగమును గీతిక కప్పనమొనరించి హాయినందితిని.

ఆహా! ఆలయమనిన నిట్లుండవలెను గదా! మనసున దురంతచింతలు చింతనిప్పులవలె రవుల్కొనుచుండ, దేవమందిరమున ప్రవేశించితిమేని, చింతలు తమ చితియందే తామచిరములో గ్రుగ్గి, పన్నీరు కాల్వలుపోలు సద్భావములకు స్వాంతమున చోటొసగును. క్లిష్టదైనికానుభవములందెన్నెన్నియో యాఘాతములు తినినవారికి దేవాలయములు సాంత్వనమును, ఆనందము నొసగు దివ్యధామములని యెఱిగియే ప్రాచీనులు మనుష్యజీవనమున మందిరదర్శనమును ముఖ్యఘట్టము గావించిరి. హృదయతంత్రులనుమీటి, విశాలాంతరంగమున నెందో పన్నుండియుండిన శక్తులనులేపి, మనసునుద్వేగపూరితమొనరించి, ఉన్నత భావనావీధులందు మానవాత్మ నెగురజేయునవి దేవమందిరాంతర్భాగములు. అక్షరసందర్శన మెఱుగనివారిని సయితము విజ్ఞానులను గావించెడివి సంకీర్తనములును, భజనలును. ఇవి కాలహరణమునకై ఏర్పడిన కాలక్షేపములు కావు. విజ్ఞానగోష్ఠికి దేవధామములు చక్కని నిధానములై యుండెడివి. ప్రాచీన దేవాలయములు విద్యాలయములును, కళామందిరములును, పుస్తకభాండాగారములు కూడనని ఎవ్వరెఱుగరు?

నాదృష్టి యూర్ధ్వదిశ బఱతెంచినది. గుండెలో సంతోషతరంగము లుప్పొంగుచుండ, మెల్లగలేచి, మీది యాగారమున బ్రవేశించితిని. నలువలంకులందలి రమ్యదృశ్యము మఱింతస్పష్టముగా గన్పట్టినది.

ఆగంతువులు మందిరమునకు చుట్టును గల వసారాలో ప్రదక్షిణముచేయుచు, లోపల బ్రవేశించుచుండిరి. వారివెనుక నిరువురు సుందరీమణులు వంగివంగినడచుచు, చేతులందలి తెలివలువలతో స్ఫటికప్రస్తర పథమునబడిన పదరేణువులను తుడిచివేయసాగిరి. అట్లే మందిరపురోభాగమునగూడ నిరువురుపురుషులు చూపఱులు ముందలకడుగిడినంతన నెప్పటికప్పుడు తెరువును పరిశుభ్రముచేయుచుండిరి. చూచితిరా? సిక్కుల యాచారము? శుభ్రతయెడల వారికిగల మక్కువ ఎట్టిదో విలోకించితిరా?

యాత్రికుల పాదధూళినట్లు తుడుచుచుండు వారు జీతమును, భత్యమునుపడయు భృత్యులుకారు. వేలసంఖ్యమీాద వేతనములందు వారును, పెద్దమొత్తముల పెన్షనుల బడయువారును, అతులైశ్వర్య సంపన్నులునుజుడీ! స్త్రీలో? ఉన్నతకుటుంబములందు మసలు మానినీమణులుసుడీ! సేవాధర్మమును వారెట్లు నిర్వహించుచున్నారో, నిష్కామ కర్తవ్యము నెట్లు నెఱపుచున్నారో, చదువరులు మానసికముగ నీ మజిలీలందు నన్నను సరించి వచ్చిరేని, సిక్కులసుహృద్భావమును దృష్టాంతీకరించు బహుళసంఘటనములను గాంచగలరు.

బాహ్యావాతావరణమును, స్థల ప్రాముఖ్యమును అంతరంగికోన్నతికి తోడు పడుట ప్రసిద్ధవిషయమేకదా! ప్రశాంతప్రదేశములందు—ఆశ్రమములనుడు, మందిరములనుడు, వనవాటికలనుడు-లతాలయములనుడు-వసించియేకదా మునిముఖ్యులును, విజ్ఞానయాత్రీకులును "భావాంబరవీధి విశ్రుతవిహారు"లగుటకై పయనమైరి. సౌందర్యనిధానములందుండియేకదా, మధురమంజుల నిస్వనములకు వీనులొగ్గియేకదా తమ మనసులను దేవమందిరములు గావించుకొనిరి! ప్రాచీనుల ఈయుత్కృష్టాశయమునకు నేడు భంగము వాటిల్లినది. ఇట్లని బహుళభారత యాత్రస్థలములందు మసలి గుర్తించితిని. హిందూదేవాలయ ప్రాంగణములందు దుష్కృత్యములు జరుగుచుండుటయు, దురూక్తులు శృతి గోచరమగుటయు నిత్యసంభవములైనవి. ధనసంపాదనమునే వృత్తి జేసికొని, వంచనమందును, అనృతవాదములందును వివిధములైన అసభ్యాచరణములందును ఆఱితేఱిన వారెందరో ఈతావులందు నేడు కేగంటలు వాయించుచున్నారు. ఈ శోచనీయదృశ్యము లంతరించుటెన్నడో! తోడిహిందువులు సిక్కుసోదరుల మహత్తర దృష్టాంతములను మేలుబంతులు గావించుకొనుటపాడి.

పల్దిక్కులకు దృక్కుల బుత్తెంచుచు మందిరశిఖరమందలి విశాలాగారమున నట్లె కూర్చునియుంటిని. హాల్యాపనిపట్టించి, పొట్టి పిచికి నాకడకువచ్చి దాపున చతికిలపడినాడు. ఇంతలో నొకసిక్కువృద్ధుడు మాకడకువచ్చి, నన్నుద్దేశించి "అయ్యా! బంగాళీవారిచటికి మిగుల నరుదుగవత్తురు. మీారు మామందిరమునకు వచ్చుటచే ఎంతోసంతోషముగానున్నది. ఈరాత్రికి తమరిందె విడసియుండుడు. యాత్రీకులకై ఇచట భోజన వ్యవస్థకలదు. పరుండుటకుగూడ వలసిన యేర్పాటున్నది. నావేడికోలు మన్నింపుడు" అని వందనపూర్వకముగా పలికినాడు. అసలైన తెలుగువాడనని అభిప్రాయపడుచుండును. నేను బంగాళీనని ఈత డెట్లనుకొనినాడో! ముసలివాని పొరపాటును సరకు సేయక, అతనియాదరోక్తులకలరి "భయ్యా! నేను బంగాళీవాడనుగాను, వంగమాతచే పెనుపబడితిని.—అంతియే! దక్షిణదేశస్థుడను; ఆంధ్రుడను. గోదావరీతీరమునుండి యరుదెంచితిని. ఈ పుష్కరిణికి సమీాపమున వసించు సూరజ్ మహరాజ్ కలకత్తాలోనుండుతఱి, మా కిరువురకు పరిచయము



డాక్టరు ఎస్. లక్ష్మీదేవిగారు
బళ్లారి స్త్రీల నియోజకస్థానమునుండి
అసెంబ్లీకి ఎన్నుకొనబడిరి.



శ్రీమతి మాసిలామణిపిళ్లెగారు
తిరునల్వేలి పాలంకోట భారతీయక్రైస్తవస్త్రీ
నియోజకస్థానమునుండి అసెంబ్లీకి
ఎన్నుకొనబడిరి.



శ్రీమతి అమ్ముకుట్టిఅమ్మాళ్ గారు
కాలికట్ - టెల్లిచేరి స్త్రీనియోజకవర్గము
నుండి అసెంబ్లీకి ఎన్నుకొనబడిరి.



శ్రీమతి లక్ష్మీకృష్ణస్వామిభారతిగారు
దిండిగల్ స్త్రీ నియోజకస్థానమునుండి
అసెంబ్లీకి ఎన్నుకొనబడిరి.



బొంబాయి ప్రిన్స్ ఆఫ్ వేల్సు వస్తుప్రదర్శనశాల
సుందరదృశ్యము

కలిగెను. (బుడంకాయిని జూపి) వీనిగూడి నే నాతనియింట బసజేసితిని. నేటి కందే తడసి, రేపు లాహోరు పోదలచితిని. మీ సత్కారము మహోత్తరమైనది. మీ సేవా ధర్మము మహోత్కృష్టమైనది. మీ యాదరోక్తులు నామనసునకు విందుగూర్చినవి. ఇంతకు మించినవిందును నేనిపు డభిలషింపను" అని నే నుత్తర మొసగితిని. ఆంధ్రుడ ననినపుడు వృద్ధునకు బోధపడలేదు. మదరాసీ ననినవాని బోధపడియుండెడిది. దక్షిణ దేశస్థుడ నంటిని గాన నతడు "మీరు మద్రాసీలని గుర్తింపనైతిని. క్షమించండి. మద్రాసీలు విజ్ఞానులని, ఎంతో మంచివారని, ప్రజ్ఞావంతులని వినుచుందుము. బంగాళీల నపుడపుడైన నిందు చూతుముగాని మీ దేశస్థుల నీవఱకు చూడనైనలేదు. మీరువచ్చితిరని వినినచో, నిచటి మాసోదరులెంతో యానందింతురు. సూరజ్ మహారాజ్ ను మేమెఱుగుదుము. ఆతనితో చెప్పెదము. మీరిందే కొన్నిదినములు విడియుడు" అని యాతడు పలికి, ఎవరినో తీసికొనివచ్చుటకై కాబోలు క్రిందికి పోబోయినాడు. దక్షిణసీమస్థుడనని నపుడు వృద్ధునియానంద మతిశయించుట గంటిని. ఆతనివేడికోలున మఱింత యావేశము ప్రవేశించుట గనిపెట్టితిని. బుడంకాయిగాడు ముసిముసినవ్వులు నగుచున్నాడు. ఉబ్బితబ్బిబ్బగుచున్నాడు. సంతోషమును పట్టజాలక, చప్పట్లుకొట్టసాగినాడు. వానికింత యానందమేలకలిగెనో! వృద్ధుడుకోరినట్లు నేనందు విడియుదుననియు, మరలతనకు కావలసినంత హల్వా లభించుననియు ఆతడు యోచించియుండును. పోవుచున్న ముసలి చేయిబట్టుకొని నిలిపి "మీరింత శ్రమదీసికొనకుడు. క్షమింపుడు. సూరజ్ ను దీసికొని రాత్రి కొంతసేపిందు మిత్రులతో గడపెదను" అని పలికితిని.

తుదకు వృద్ధు డెట్లో నామాటలకు సమ్మతించినాడు. వెంటదోకొని, ఆలయమందలి చిత్రములను చూపుచు, వాని ప్రాముఖ్యమును చిత్రవిచిత్ర హావభావములతో వర్ణింపదొడగినాడు. ఒకచెవి వాని నుడువులకును, రెండవచెవి గీతారవమునకును నప్పగించితిని.

ఇంతలో ప్రొద్దుగ్రుంకెను. ఇక కొలది నిముసములుమాత్ర మందుతడసి, పిచికితో నవ్వలి కరిగితిని. ముసలివా డపుడైనను మమ్ములను వదలలేదు. మాతో వెలుపలికి వచ్చి, మందిరమున కించుక దూరమునగల మహోన్నతస్తంభమును జూపి "అయ్యా! దీని నెక్కవచ్చును. లోపల మెట్లున్నవి. పైనుండిచూచితిరేని, అమృతసరమంతయు చక్కగ గోచరించును. చక్కనైన దూరదృశ్యములెన్నో కానంబడును" అని నన్నుద్దేశించి యాతడనినాడు. "ఎక్కిచూతు" మని నే బలికినంతన నతడు స్తంభముదెస దారిదీసి, అందు బ్రవేశించినాడు. వానివెన్నంటి నేగూడ నందు జొచ్చితిని. పొట్టిపిచికి నా వెనుకనుండి నడచుచున్నాడు. లోపల ప్రవేశించి, రెండు మెట్లెక్కినతోడనే "బాబారే!" అని వాడు కెవ్వున కేకవేసి కూలబడినాడు! మేమిర్వురము ఉలికిపడితిమి!

# భావరసలక్షణములు

సత్యవోలు శ్రీరామమూర్తిగారు.

ఈ భావరసలక్షణములను సకల జనులు స్త్రీ పురుష భేదములేకుండ తెలిసికొనవలసి యున్నది. లోకము నెఱుంగనివారు జీవయాత్ర ననుకూలముగ జేయజాలరు. సృష్టిలో స్త్రీ పురుష వ్యక్తులయందు సహజముగ కొన్ని గుణములు పట్టుబడియున్నవి. మనసునందున్న యూహను శరీరావయవములచేత దాని రసస్ఫురణముగునట్లు వ్యక్తముచేయుట యభినయమనియు, నారసమును వ్యక్తముచేయు మాటలు భావగర్భితములగుటచే నాయికానాయకులు పరస్పరము గావించు సంభాషణలు, చేష్టలు రసభావయుక్తములగుట యటుండ, సకల వ్యవహారములు రసభావబద్ధములై లోకమున వ్యవహరింపబడుచుండును. కావున నా రసభావ సంప్రదాయములతో బాటు నాయికానాయకసంప్రదాయముగూడ సకల జనులు దెలిసికొనుట మంచిదని క్రోడీకరించి వ్రాయుచున్నాను.

## భావలక్షణములు

భావమనగా నేవికారములేకుండ అనగా నేయూహయులేకుండ పరిశుద్ధమైయుండు నంతఃకరణము. ఈభావమును విభావము, అనుభావము, సాత్త్వికభావము, సంచారీభావము, స్థాయీభావమునని యైదువిధములుగ నాలంకారికులు విభజించిరి. అందు విభావము ఆలంబనము, ఉద్దీపనమునని రెండు తెఱంగులు. విభావమనగా శృంగార రసకారణమైనది. రతి యను స్థాయీభావము, దేనిచే భావింపబడి యెవరి నాశ్రయించి కలుగుచున్నదో అట్టిది ఆలంబనము. స్త్రీ పురుషులకు గలిగిన కోర్కెను వృద్ధి పొందించునది యుద్దీపనము. ఈ యుద్దీపనమైదు విధములు. 1. గుణము. 2. చేష్టలు. 3. అలంకారములు. 4. తటస్థములు. 5. అవస్థలు. ఆలంబనగుణవిశేషములు యౌవనము, రూపము, లావణ్యము, సౌందర్యము, అభిరూప్యము, మార్దవము, సౌకుమార్యము నని యేడువిధములు. నాయికానాయకులకు కాలక్రమమున వృద్ధిపొందు ప్రాయము, రూపము మున్నగునవి యాలంబనములు కలిగిన వెనుక నుద్దీపనములు కలుగును. అనుభావమనగా మనసునందున్న సంకల్పమును కరచరణాద్యవయవములచేత కటాక్ష భుజాక్షేపాదులచేత వ్యక్తము జేయుట. 1 చిత్తజానుభావము, 2. గాత్రజానుభావము, 3. వాగారంభానుభావము, 4. బుధ్యారంభానుభావమునని నాలుగువిధముల ననుభావమును విభజించిరి. ఈ యనుభావముల భేదములు చాలగలవు. ఇతరుల యొక్క కష్టసుఖములయం దేవని మనస్సు వర్తించుచుండునో యదియె సాత్త్వికభావము. ఈ సాత్త్వికభావము స్తంభము, స్వేదము, రోమాంచము, ప్రళయము, స్వరభేదము, వైవర్ణ్యము, వేపదు, అశ్రువునని యెనిమిది విధములు. సంచారీభావములు నిర్వేదము,

గ్లాని, శంక, శ్రమము, ధృతి, అసూయ, మదము, ఆలస్యము, దైన్యము, హర్షము, విచారము, మోహము, స్మృతి, పీడ, చపలత, ఆవేగము, జడత, గర్వము, విషాదము, ఔత్సుక్యము, నిద్ర, అపస్మారము, సుప్తి, విబోధము, ఆవర్షము, అవహిత్థ, ఉగ్రత, మతి, వ్యాధి, ఉన్మాదము, మరణము, త్రాసము, వితర్కమునని ముప్పది మూడు విధములు. స్థాయీభావములు రతి, ఉత్సాహము, శోకము, విస్మయము, హాసము, భయము, జిగుప్స, క్రోధము నని యెనిమిది విధములు. ఈ భావములయొక్క భేదములు అలంకారికులు, భరతశాస్త్రజ్ఞులు, నభినయశాస్త్రవేత్తలు సలక్షణముగ దెలిపియున్నారు. ఈ లక్షణములను దెలిసికొనినయెడల లోకములో నిత్యము పరస్పరము జేయు సంభాషణలు చేష్టలు సుబోధకములగుచుండును. గ్రంథవిస్తరభీతిచే నాయా లక్షణముల విపులముగ నిందు వ్రాయక భేదమునుమాత్రము దెలిపియున్నాను. ఇక రస స్వరూపముగూడ క్లుప్తముగ దెలిసికొనుట మంచిది.

రసలక్షణము

ఆలంబనోద్దీపనాదిభావములను రత్యాది భావములను దెలుపునది రసమనబడును. ఈ రసములు శృంగారము, హాస్యము, కరుణ, వీరము, భయానకము, బీభత్సము, రౌద్రము, అద్భుతము, శాంతము నని తొమ్మిదివిధముల ప్రాచీనకవిపుంగవులు, నాలంకారికులు విభజించియున్నారు. ఈ నవరసముల సంప్రదాయములు నభినయశాస్త్రజ్ఞులకు కవులకు కావ్యపాఠకులకు దెలిసికొనుట యెంత ముఖ్యమో సకల జనులు దెలిసికొనుటయు నంత ముఖ్యమె. శృంగారరసము విప్రలంభశృంగారమనియు, సంభోగశృంగారమనియు ద్వివిధములు. అందు విప్రలంభశృంగారమున అయోగవిప్రలంభము, విరహవిప్రలంభము, మానవిప్రలంభము, ప్రవాసవిప్రలంభము, శాపవిప్రలంభమునని యైదువిధములు. సంక్షిప్తము, సంపన్నమునని సంభోగశృంగారము ద్వివిధములు. యుద్ధవీరము, దానవీరము, దయావీరము నని వీరరసము మూడు విధములు గలిగియున్నది. మరియు హాస్యరసము స్మితము, హసితము, విహసితము, ఉపహసితము, అపహసితము, అతిహసితమునని యారువిధములై యున్నది. ఈ నవరసస్వరూపములు దెలియకుండ కావ్యరచయితలు గాని నాటకరచయితలు గాని నాట్యాంగనలు గాని నటకులు గాని ప్రకాశింపనేరరు.

—o—

ఒక పెద్దమనిషి అప్పుడే లండనునుంచి దిగివచ్చిన దొరగారి వేషంతో ఒకహోటలులో బసచేస్తూ హోటలు పెద్దమ్మతో

"పెద్దమ్మా! నేను ఏహోటలులోంచి వెళ్లిపోతున్నా కంటతడి చేసుకోని పెద్దమ్మ కనబడలేదు సుమా!

పెద్దమ్మ:—బాకీ ఇవ్వనందుకు కాదు గదా?

# ఎత్తుకు పైయెత్తు

చ. రా.

ఈమారు జ్యేష్ఠమాసములోనే పెళ్లి తప్పకుండా జరిగిపోవాలని సాంబమూర్తి భగీరథప్రయత్నాలు చేస్తూవున్నాడు. ఇది తెలియవచ్చినప్పటినుంచి సూరమ్మస్థితి వర్ణించేటందుకు వీలులేకుండా మారిపోయింది. ఆవిడ కాలుకాలిన పిల్లిలాగ యిల్లంతా తిరుగుతూ ఇంట్లోవున్న ఒక వంటావిడమీద విసుక్కుంటూ నిద్రాహారాలు అక్కరలేనట్టే సంచరిస్తూ వుంది.

సాంబమూర్తి కేమిచెప్పినా చెవికెక్కక పోవడం సాధారణమే కాని యితరులందరికీ సూరమ్మమాటలే నచ్చేవి. అందువలన పదియేళ్ళనుండీ సాంబమూర్తి చేస్తూవచ్చిన పెళ్లి ప్రయత్నాలన్నీ శంకరశాస్త్రి సహాయముతో ఏదో విధముగా చెడగొడుతూ వచ్చింది. అయినా సాంబమూర్తి పూరకుండేఘటము కాదు. శతవిధాల ప్రయత్నించినా ప్రతియేడూ పరీక్షలో తప్పించే యూనివర్సిటీని గమనించకుండా యేదోవిధముగా ప్యాసుకావాలనే విద్యార్థిలాగు, శంకరశాస్త్రిని సూరమ్మను లెక్కించకుండా అతడు పెళ్లిప్రయత్నాలు చేస్తూనే వుండేవాడు. వేయికన్నులతో కనిపెట్టి ఆనాటికానాడే సంగతుల తెలిసికొంటూ వుండే సూరమ్మా పూరకుండేది కాదు. అతనికంటె ఆవిడ నాలుగాకు లెక్కువ చదివింది.

ఈమారుమాత్రము సాంబమూర్తి గట్టిపట్టే పట్టినాడు. పుష్కలముగా డబ్బు యిస్తానని పురాణము పేరిశాస్త్రిని తిన్నగా వలలో వేసుకున్నాడు. అతడుకూడ ఇతరులు ఏమిచెప్పినా, ఏమి ఆటంకములు కలిగించినా తనకూతురును ఇచ్చి తప్పకుండా వివాహముచేస్తానని తయారయ్యాడు. ఎప్పటిలాగే సూరమ్మ శంకరశాస్త్రి యీసంబంధముకూడా చెడగొట్టుటకు అన్నివిధాలా ప్రయత్నిస్తారని వీరిద్దరికీ తెలుసును. వారి తాకుడుకుతగిన కోటగోడలు నిర్మించుకోవడానికి కాబోయే అల్లుడూ మామగారు చేసే ప్రయత్నాలుకూడ సూరమ్మ వినింది. పూర్వపుయెత్తులు ఈసమయాన ఉపయోగపడేటట్టు సూరమ్మకు కనపడలేదు. ఈసమయములో శంకరశాస్త్రివుంటే ఎంత బాగుండేది. అతడీమారు మునుపటిలాగే శెలవులలో యింటికిరాలేదు, సీజను టిక్కెట్టుకొని పెళ్లాముపిల్లలతోటి దక్షిణదేశయాత్రకు రైలుజేరినట్లు వారము క్రిందనే అతనిదగ్గరనుంచి వుత్తరము వచ్చింది. ఇప్పుడెక్కడవుంటాడో? ఎప్పుడు వస్తాడో? అతను వచ్చేలోపలనే సాంబమూర్తి పెళ్లితంతు ముగించుకుంటే? ఆవిడను అంతగా బాధపెడుతూ వున్నది అదే.

సాంబమూర్తి పెంటపాడు అగ్రహారములో ప్రసిద్ధభూస్వామి. ధనము పుష్కలముగా వున్నవాడు. పెట్టిపోతలుకాని ధానధర్మాలుకాని దానిచెంత కెప్పుడూ పోయినట్లు కనపడవు. సాంబమూర్తి వద్దవున్న ధనముకంటె ఛాందసము సనాతనాచారము ఎడల పట్టుదల అధికము. ఆయనమాటలలో, చేష్టలలో, ప్రవర్తనలో, వేషములో అది ప్రస్ఫుటమై వుండేది. సనాతనాచారాలకు ఎక్కడైనా కొంచము లోపము వస్తుందంటే ప్రాణము తీసుకునేవాడు. అంతేకాని మానవస్వాభావికమైన దయాదాక్షిణ్యాది గుణాలలో ఆయన కటికదరిద్రుడు. ఆధునికాభిప్రాయాలన్నా సంస్కరణాలన్నా అతనికి మంట. శారదాబిల్లుపై ఆయన విసరిన శాపనార్థాలు దానికి తగిలేవుంటే ప్రపంచము, అతనితోకూడా, భగ్గుమనివుండేది. ఆయనకిప్పుడు పళ్లు అన్నీ వూడిపోలేదు, పిలకలో ఇంకా

ఒకటి రెండు నల్లని వెంట్రుకలు కనిపించేవి; మనిషి వారిలేని ధనరాకారము దాల్చినా యేభై అయిదేళ్ళకు మించని యువకుడు—అతనిదృష్టిలో.

సాంబమూర్తికి శంకరశాస్త్రి ఒక్కడే కొడుకు. అతనితల్లి బాల్యాన్నే మరణించింది. అప్పటినుంచి ఎక్కువగా మేనత్తపోషణలోనే పెరిగాడు. తరువాత సాంబమూర్తి రెండుమార్లు పెళ్ళిచేసుకున్నాడు. అతడు పెళ్లాన్ని పెట్టేబాధ సామెత అయిపోయింది. మొదటిభార్య టైఫాయిడ్ వాతపడింది. రెండో ఆవిడ అదృష్టవశాత్తున కాలుజారి నీటి కాహుతి అయిందట! మూడో ఆవిడ ఆయదృష్టాన్ని బహిరంగముగానే కలిగించుకుందట!! ఆవిడపోయి యిప్పటికి పదేళ్ళవుతుంది. సాంబమూర్తి ఆముగ్గురుపెళ్లాలకు తద్దినాలు శాస్త్రోక్తముగా చేయాలని చూపేఅక్కరలో ఏకొద్దిభాగమో వారి జీవితకాలములో చూపించి వుంటే అసలు ఆతద్దినాల ఆవశ్యకత వుండేదికాదని అనుకునేవారు.

శంకరశాస్త్రికి తండ్రిప్రవర్తన వ్యాపారములు పరిపడవు. మేనత్తగారిసహాయముతోనే విద్యాభ్యాసం ముగించాడు. జీవితము సరళముగా శాంతముగా గడవాలంటే తండ్రికి సాధ్యమైనంత దూరముగావుండడము మంచిదని రాజమండ్రి కళాశాలలో వుపాధ్యాయుడుగా చేరాడు. సెలవులలో మాత్రము యింటికి వస్తూ వుండేవాడు. ఆకాలములోకూడా మేనత్తగారింట ఎక్కువకాలము వుండేవాడుక. వారిద్దరిని చూస్తే సాంబమూర్తికి లోపలగుబ్బ. తనకు పాతికేళ్లకు పైబడినతరువాత యిద్దరు మనవులతో వుండే తనతండ్రిగారికి నాలుగోపెళ్లి అంటే శంకరశాస్త్రికి అసహ్యం వేసేది. అంతేగాకుండా తన పినతల్లులు ఏంగతిపట్టారో అతడింకా మరువలేదు.

సూరమ్మ సాంబమూర్తి యేకోదరులైనా వారి గుణాలు పరస్పరసంబంధము లేనివి. ఆవిడ కిపుడు దాదాపు యేభైయేళ్లున్నా యింకా దృఢముగా కనిపిస్తుంది. ఆవిడ తాడేపల్లిగూడెములో చిత్రాలవారింటికోడలు. అత్తగారింటి ధనమూ, మగనిదర్జా, తనయింట సర్వాధికారము ఆవిడసుగుణాలకు దోహదమే చేశాయి. ఆవిడ దేవుడిచ్చిన తెలివితేటల చక్కగా వుపయోగించేది; కష్టములోవున్నవారిని చూస్తే మహా సానుభూతి. ఆవిడ ముగ్గురుకూతుళ్లూ అత్తగారింట సుఖముగా కాపురాలు చేస్తున్నారు. ఆవిడ భర్త పోయిన పదేళ్లనుండీ యింటివ్యవహారాలూ, భూముల విషయాలూ శంకరశాస్త్రిసహాయముతో చూచుకుంటూ వుండేది.

సాంబమూర్తి తనభార్యలను పెట్టే యమయాతన ఆమెహృదయాన్ని చీల్చివేసింది. రెండో మూడో పెళ్లిళ్లుకూడా జరుగకుండావుండాలని ప్రయత్నించిందికాని తనప్రయత్నాలు సాగలేదు. తరువాత మాత్రము నాలుగోపెళ్ళి ప్రయత్నము వచ్చినపుడంతా యేదోవిధముగా జరగకుండాచేసింది. సాంబమూర్తి యిపుడుచేసే గట్టి ప్రయత్నాలని చూస్తే అతడు యింకో అమాయికబాలిక ప్రాణాలనుకూడ తగులపెట్టేటట్టుంది. తానూ అట్టి గట్టిప్రయత్నాలుచేసి యీ సంబంధమూ మాన్పించాలని ఆవిడ దృఢముగా తీర్మానించుకుంది.

* * *

తిరుపతినుండి చెన్నపురికి వచ్చామనీ అచటనుండి దక్షిణము వెళ్లుతున్నామనీ, పదిపన్నెండురోజులలో తిరిగి వస్తామనీ శంకరశాస్త్రి దగ్గరనుండి వచ్చినవుత్తరముచూచుకొని వెంటనే బైలుదేరి రావలసిందని టెలిగ్రాం యిప్పించింది సూరమ్మ. మరుదినము మెయిలులో శంకరశాస్త్రి రుక్మిణమ్మ, యిరువురు పిల్లలూ తాడేపల్లిగూడెము వచ్చారు.

సూరమ్మ మేనల్లుడితో సాంబమూర్తి చేస్తూవున్న తీవ్రమైన పెళ్లి ప్రయత్నాలన్నీ చెప్పింది. ఒక అమాయికబాలిక జీవితము దుర్భరముకాకుండా చేయడము

తన ధర్మమన్నది. శంకరశాస్త్రికి ఆలా చేయడము యిష్టమేకాని తనతండ్రి యీమారు అంత తీవ్రముగా ప్రయత్నించడమునకు విచిత్రమేసింది. ఆపెళ్లేఅయితే ఆబాలిక గతేమి కావాలి? తరువాత తాను తలెత్తుకుని నలుగురిలో తిరగడమెలాగ?

'వెంటనే పెంటపాడువెళ్ళి తండ్రిగారికి సాధ్యమైనంతవఱకు చెప్పిచూద్దాము. బైలుదేరండి సాయంత్రము' అన్నాడు సూరమ్మతో.

'ఇదివఱకూ చూచిందేగా! చెప్పితేమాత్రం వింటాడా? ఇతరాప్రయత్నాలు చేయవలసిందే గాని' అంది సూరమ్మ.

'ఉపయోగములేకపోతే తరువాత యోచిస్తాము.'

'కాదుకూడదు. నేను చేసుకుంటానని భీష్మీకరించి కూర్చుంటే మనమేమి చేయగలుగుతాము?' అంది రుక్మిణమ్మ చిన్నకుమారుడు పార్వతీశాన్ని ఎత్తుకుని.

'అమ్మా! ఏమిటే?' కుంచిళ్లులాగుతూ అమ్మవైపు ముఖమెత్తుకుని పెద్దకొడుకు నాగభూషణం ప్రశ్నించాడు.

'మీ తాతకు పెళ్లటరా?' అంది రుక్మిణమ్మ కుమారుని తల నిమురుతూ.

'అవ్వనటే' తిరిగి ప్రశ్నించాడు నాగభూషణం.

అందరూ నవ్వారు. అబ్బాయీ వారితో కలసి నవ్వాడు.

వారందరూకలసి ఆనాటిసాయంకాలమే పెంటపాడువెళ్లారు. పిల్లరాక సాంబమూర్తికి మేఘాలులేని పిడుగులాగ కనపడింది. అయినా, 'వస్తేమాత్రమేమి? ఈ చచ్చుపెద్దమ్మల ఆటంకాలచేత నాపెళ్లి ఆగుతుందా?' అనుకున్నాడు ధైర్యముగా.

రాత్రి ఎనిమిదిగంట లౌతూవుంది. అందరూ భోజనంచేసి చావడిలో కూర్చున్నారు. రుక్మిణమ్మ చిన్నకుమారుని మామగారిదగ్గరయిచ్చి వాకట్లో నిలబడింది. అబ్బాయి తాతబోసినోటవంక చూస్తూ వెన్నెలలు విరజిమ్ముతూ వున్నాడు. వాడిప్రక్కనే నాగభూషణం కూర్చున్నాడు. సూరమ్మ వాకలిదగ్గరగా కూర్చుంది. శంకరశాస్త్రి ఆకులునమలుతూ పడకకుర్చీలో కూర్చున్నాడు. సాంబమూర్తి యెదురుగా బెంచిలో అబ్బాయిలతో కూర్చున్నాడు.

'ఏరా! శంకరం! దక్షిణము వెళ్లుతున్నానని వ్రాశావు. ఇంకా వారముకూడా కాలేదు—' అన్నాడు సాంబమూర్తి.

'బైలుదేరానుకాని ఇక్కడిపనుల తొందరవలన అది మానుకోవలసి వచ్చింది.'

'ఏమిటిది?'

'మీరు పెళ్లి నిశ్చయము చేసికొన్నారటగా! మేమా సమయానికి ఇంటివద్దలేకుంటే ఏలాగ?'

'ఓహో! అదాకథ. ఏవెధవ చెప్పాడు ఈకబుర్లు నీకు?'

'దానికేమి? ఎవరైనా చెప్పుతారు. అయితే ఇది నిజము కాదంటారా?'

'నిజమూ అబద్ధము అనికాదు. మొన్న పురాణం పేరిశాస్త్రి తనకూతురు పెళ్లివిషయము ప్రస్తావించారు. ఏదోచూద్దామన్నా అంతే.' సాంబమూర్తి చెప్పే ఆ ధోరణే సత్యానికి దూరంగా వున్నట్టు కనబడుతుంది.

'ఎందుకన్నా అబద్ధాలు? ముహూర్తముకూడా నిర్ణయించుకోడానికి ప్రయత్నిస్తున్నారట. లోలోపల అన్నియేర్పాట్లు జరిగాయట! ఎన్నిమార్లు ఎంత చెప్పినా మీరు తెలుసుకొనకుండుట మాకు నొప్పి కలిగిస్తూ వుంది' అంది సూరమ్మ మధ్యలో అందుకుని.

'నాకు తెలుసు. ఇది యెప్పుడూఇంతే. నాపెళ్లంటే దీనికి కడుపుమంట. అన్నగారేదోపెళ్లాడి సుఖముగా వుండాలని దీనికి ఏకోశానా లేదు. ఎప్పుడూ ఈ

విధముగా ఆటంకాలు చెప్పుతూ బాధపెడుతూ వుంటుంది.'

సూరమ్మవైపు సాంబమూర్తి చురచురచూచాడు.

'వుంటేవుంటానుకాని పాతికేళ్ల కొడుకునీ, యిరువుడు మనమలినీ పెట్టుకొని పెళ్ళంటూ ప్రాకులాడడం ఏమంత సబబు. చెప్పితేమాత్రము మేము చెడ్డవాళ్లము—' అంది సూరమ్మ అన్న కోపాన్ని గమనించకుండా.

'కొడుకుంటె పెళ్లామక్కరలేదా? కొడుక్కీ పెళ్లికీ సంబంధమేమిటి?' అన్నాడు తన తర్కశాస్త్రం వెలగబెడుతూ సాంబమూర్తి.

'అదికాదండి నాన్నగారు. పెళ్లి పేరంటాలకు ఒకవయసంటూ వుండాలి. మీకిపుడు యేభైఅయిదుకు పైబడుతూ వుందికదా. ఆలోచించండి.'

'ఇదివరకే ఆలోచించాను. పెళ్లయితే నాకన్నివిధాలా సౌఖ్యమే. పదేళ్లుగా యేవంటమనిషివండిన కూడు తిని అవస్థపడుతున్నా. పోనీ అదేలాగో ధరిద్దామనుకుంటే వృద్ధాప్యములో పిలిస్తే పలికేవారు లేకుండావున్నారు. ఎంతకాల మిలాచావమంటారు!'

'అందుకోసరమా పద్నాగేళ్ల అమ్మాయిని తెచ్చుకొనదలంచారు! చలాకీగా వుంటుందనా! నాలుగు డబ్బులుపడేస్తే రాత్రింబవళ్లూ కనిపెట్టుకుని వుండేవారు కావలసినంతమంది. శంకరం ఆయేర్పాట్లన్నీ చేస్తాడు కావలిస్తే.' అంది సూరమ్మ.

'ఆ—' మనవాళ్లుకాకపోతే ఎవరూ చూడరు. కొడుకు కోడలు వుండిమాత్రము నాకేమిసుఖము? కాబట్టే నాప్రయత్నం.'

'అలా అయితే నేనూ రుక్మిణి యిక్కడేవుండి మీశౌకర్యాలన్నీ చూస్తాము. ఇక మీకు పెళ్లెందుకు?'

'ఎంతైనా స్వంతపెళ్లాము వున్నంత రాదు. పురాణము పేరిశాస్త్రికూతురును పెళ్లాడ నిశ్చయించుకున్నాను. లగ్నముకూడ నిర్ణయమైంది. తాడేపల్లి రోడ్డుమీదవున్న దేవాలయములో జ్యేష్ఠ శుద్ధదశమి ఆదివారము లగ్నము. మీకీసంగతి వ్రాయవలెనని అనుకున్నాకూడా' అన్నాడు సాంబమూర్తి సగర్వముగా అబ్బాయివంక చూస్తూ.

'నాన్నగారూ! క్షమించండి. ఈ పెళ్లివిషయాలు మానేయండి. ఇటువంటిఘోరాలు మీవంటిపెద్దలు చేయడము భావ్యముకాదు. మీ సమస్తసౌకర్యాలు మీదగ్గరేవుండి నేను చూస్తుంటాను.'

'ఊహూ అన్నీ అపుడే నిర్ణయమైపోయాయి.'

'ఏమిటన్నా మీరు మరీని. ఇపుడు చచ్చిన ముగ్వురు చాలక ఇంకో అమ్మాయి ప్రాణాలుకూడ తీయ తలంచారా. ఇదెంతమాత్రమూ జరగకూడదు.' అంది సూరమ్మ గట్టిగా.

'ఇకచాలించు నిన్నెవరూ అడగలేదు. నీకిష్టము లేకపోతే బైటికి నడు. నిన్నెవరూ రమ్మనలేదుకూడ.'

'ఆమెకొక్కతెకే గాదు. మేమింక తలెత్తుకుని తిరుగుటకు వీలుండదు ఈపెళ్లి అయితే. ఇదివరకు జరిగినవే చాలు. ఇంకా ఇలాంటివా? వీల్లేదు.' శంకరశాస్త్రి మాటల్లో ఆవేదన కనపడింది.

'వీల్లేకపోతే మేన త్తతోకూడా గంగలో దిగు. మీ యిష్టాయిష్టాలతో నా కక్కరలేదు. నేను మాత్రము పెళ్లిచేసుకొనడము ఖాయము. ఎవరడ్డుపెడ్తారో చూస్తానుగాని' అంగవస్త్రము సవరించుకుంటూ లేచాడు సాంబమూర్తి.

'అయితే పెళ్లి నిలపరన్నమాట' అని మరల నిదానంగా ప్రశ్నించాడు శంకరశాస్త్రి.

'ఎంతమాత్రమూ వీల్లేదు.' కడప దాటుతూ అన్నాడు సాంబమూర్తి.

ముగ్వురూ మౌనము దాల్చారు. నిశ్శబ్దాన్ని చూచి కారుమన్నాడు పార్వతీశం.

*　　　*　　　*

వచ్చినవారు వచ్చినట్లుగానే మరుదినము తెలవారకనే వెళ్లిపోయారు. ఇంత సులభముగా తన్ను విడిచిపెట్టి పోతారని సాంబమూర్తి అనుకోలేదు. కాబోయే అల్లుడూ మామగారు వారిపోకకు ఆశ్చర్యపడి సంతసించారు. కావలసిన యేర్పాటులు సాధ్యమైనంత గోప్యముగానే చేశారు. ఇంటా బయటాకూడా తన వివాహవిషయములో ఆటంకాలుంటాయనే భీతి సాంబమూర్తి హృదయములో మసలుతూనే వుంది.

శుద్ధదశమి ఆదివారము మధ్యాహ్నము ముహూర్తము. పెళ్లి జరుగవలసినదేవళము పెంటపాడుకు ఎనిమిదిమైళ్ళదూరములోవుంది. ఆదివారము తెలవకనే తనకు కావలసిన కొద్దిమందితోను సామానులతోను పెళ్లిపార్టీ ఆరు రెండెడ్లబండ్లలో పైలుదేరింది. ఇంకా కొంతమంది పనివాళ్లూ బాజాబంత్రీలవారూ వెంబడించారు బళ్లను. వీరంతా దేవళము చేరుకునేటప్పటికి యేడుగంటలయింది.

సాంబమూర్తి దేవళమువద్ద బండిదిగాడో లేదో అక్కడి చెట్లక్రింద బాజాబంత్రీలు ఒక్కమారుగా ప్రారంభించాయి. ఎందుచేతనో వాని విజృంభనముచే సాంబమూర్తిగుండె గుభేలుమంది. తనపెళ్లి జరగవలసిన సమయములో ఈశని యెక్కడపట్టిందని కంగారుపడ్డాడు. చెట్లక్రిందవున్నవారంతా ముప్పదివలబడిమంది. వారిలో చాలామంది చదువుకుండే కుర్రాళ్లలాగు కనపడ్డారు. స్త్రీలు ఏడెనిమిదిమంది మాత్రమే.

పరివారము బళ్లనువిప్పి సామానులు మనుషులు సర్దుకుంటున్నారు చెట్లక్రింద. సాంబమూర్తి మనసు మాత్రము ఆందోళనగావుంది. ఆచెట్లక్రింద విడిసిన కుర్రాళ్లు కొత్తగావచ్చిన వారెవరా అనైనా ఆలోచించకుండా కులాసాగా తిరుగుతూ మాట్లాడుతూవున్నారు. అపుడే బాజాబంత్రీలతో యిరువురు ముత్తయిదువలు దేవాలయములోనికి పోతున్నారు.

సాంబమూర్తి ఓర్పు చచ్చిపోయింది. బిరబిరా ఒక కుర్రాడిదగ్గరికి వెళ్లాడు.

'అబ్బాయీ! ఇదో—నిన్నే.'

'ఏమండి తాతగారు.'

అరె వీడి తస్సదియ్యా. ఇంకో నాలుగు గంటలలో పద్నాలుగేళ్ల అమ్మాయిని పెళ్లాడపోతూవుంటే వీడికళ్లకు నేను తాతనయ్యాను? అని సాంబమూర్తి లోపల ఉడికిపోయినా, మెల్లగా

'ఇక్కడ పెళ్లెవరిది?' అన్నాడు.

'తెలియదూ?'

'తెలియకకదూ అడుగుట—'

'చిత్రాల వారింటిది.

'ఏవూరు?'

'మావూరు.'

'అంటే—'

'తాడేపల్లిగూడెం.' గబగబా కుర్రాడు బదులు చెప్పుతున్నాడు. సాంబమూర్తికి కలిగిన ఆశ్చర్యమూ ఆదుర్ద చెప్పతరముకాదు.

'వాళ్లింట్లో ఎవరికి' మరల ప్రశ్నించాడు.

'నూరమ్మకు—' తడబడకుండా వచ్చిన యీ జబాబు సాంబమూర్తిహృదయానికి తపీమని తగిలింది.

'ఏమిటి?'

'నూరమ్మకిక్కడ యీవేళ పెళ్లి'అని అదోకరకముగా బదులుచెప్పాడు ఆకుర్రాడు.

'అర్థములేనిమాట. అడిగినదానికి జబాబు చెప్పకుండా హేళనేమిటయ్యా?'

'హేళనేమిటండి తాతగారు. కావలిస్తే వారినే అడగండి.'

'అది కాదయ్యా! ఆవిడను నీవెఱుగుదువా?'

'ఎఱుగకేమి? ఆవిడది మాప్రక్కయిల్లే అయితే.'

సాంబమూర్తికి నూరమ్మపేరు వింటూవుంటే ఆలోచనాశక్తి నశిస్తూవుంది.

'అయితే ఆవెధవ...తో ఇక్కడికి మీరెలా వచ్చారు?'

'బళ్లమీదనే వచ్చాము. కోపమెందుకండి.' అన్నాడా కుర్రాడు అదురూ బెదురు లేకుండా.

ఇంతలో శంకరశాస్త్రి దేవళములోనుండి అక్కడికి వచ్చాడు. అక్కడున్నవారంతా ఒకరొకరే వీరి చుట్టూ చేరడాని కారంభించారు. శంకరశాస్త్రిని చూడగా సాంబమూర్తికి శివమెత్తినట్లయింది. బాజా బంత్రీలు నిలువకుండా గగ్గోలు చేస్తూవున్నయి.

'ఒరేయ్ ఏమిటిరా ఈవెధవ గోలంతా?' అని కుమారుణ్ణి గద్దించాడు.

'ఏమిటి?' అన్నాడు తిన్నగా కుమారుడు.

'ఇప్పుడిక్కడ పెళ్లెవరికి?'

మంద్రస్థాయిలో శంకరశాస్త్రి 'మా అత్తయ్యకట' అన్నాడు.

'మీ అత్తయ్యకేమిటిరా! దానిపాడు?'

'చాల్లెండి అన్నగరూ. మీలాటివాడే వెనుకటికి 'శుభము పలుకరా పెళ్లికొడుకా అంటే పెళ్లికూతురు ముండ ఎక్కడుంది?' అన్నాడట. ఈశుభకాలములో ఈలాటిమాట లనకండి' అంది సూరమ్మ ముందుకు వస్తూ.

'ఇక్కడికీ వచ్చావు! నాప్రాణాలు తీయడానికి.' సాంబమూర్తి కనులనుండి నిప్పులు కురిపించాడు.

'ఎంతమాత్రము కాదు. మాపనికి మేము వచ్చాము.'

'పనేంపని—?'

'కోపమెందుకండి. శాంతంగా మాట్లాడండి. వీరంతా ఆ పనియేమిటో చెప్పగా వినేవున్నారుగా.'

'ఏమిటి వినేది నీపిం... మీరంతా యిక్కడనుండి వెళ్లిపొండి ముందు.'

'అది మాకార్యము ముగిసినతరువాతమాట.'

'పెళ్లికూతురు తయారుకావాలట. పురోహితులు రమ్మంటున్నారు.' అన్నారొకరు వెనుకనుండి.

'ఒరే శంకరం పెళ్లిపెళ్లని గోలచేస్తున్నారు ఎవరికిరా?'

'నాదంటుంటే?' అంది సూరమ్మ.

'నీకు పెళ్లిపెటాకులు: నీకేమిటి యేభైయేళ్ల...'

'ఎందుకేమిటి? ఏభైఅయిదేళ్లవారికి పెళ్లితప్పని సరి. అంతకంటె ఐదేళ్లవారి కక్కరలేదట.' అంది సూరమ్మ.

'ఇది సాగుతుందని ఈయెత్తు ఎత్తావా?'

'ఎత్తూలేదు గిత్తూలేదు. నేనుండేది ఒంటిప్రాణము. వృద్ధాప్యములో నా గతేంగాను ఎవరూలేకపోతే?'

'నాకు తెలుసునులే ఈవేషాలు.'

'వేషాలుగాదు. నిజముగా జరగబోయేదే. కాటికి కాళ్లుచాచుకొన్న సాక్షాత్తు నాఅన్నగారే, పాతికేళ్లకు పైబడిన కుమారుడూ, యిద్దరుమనమలూ వున్నవారే పద్నాలుగేళ్ల అమ్మాయిని డబ్బిచ్చికొని, పెళ్లాడుతూ వున్నారు. వున్న ముగ్గురుకూతుళ్లూ అత్తగారింటవుండి నన్ను వొంటరిగావిడిచారు. అవసానకాలములో దిక్కులేక చావమంటారా? నేనుమాత్రము ఓయిరవై యేళ్లకుర్రాడికి పుష్కలముగాడబ్బిచ్చి పెళ్లాడి ఎందుకు సుఖపడకూడదు?' అంది ఆవేశముతో సూరమ్మ.

'ఔ నౌ'నన్నారు కుర్రమూకంతా. సాంబమూర్తికి కోపముతోపాటు మైకమూ తగ్గింది.

'నీవైనా చెప్పకూడదేమిరా శంకరం. ఇదిఅన్నిటికీ ఈలాగ అడ్డముతగులుతూవుంటే బాగుందీ?' కంఠం తగ్గించి అన్నాడు శంకరమువైపుచూస్తూ.

'చెప్పితేమాత్రము వింటారా. ఎంతచెప్పినా మీరువినరు. ఈస్థితిలో ఈవయసులోకూడా పెళ్లామనేది లేకపోతే సౌఖ్యాలే లేవంటారు. అత్తయ్యగారికీ ఆ అంటురోగము తగిలినట్టుంది. భర్తంటూ ఒకడుంటేనేగాని చచ్చేకాలములో సౌకర్యాలుండ

వని భీష్మించి యిరవైయేళ్ల యువకుని పెళ్లాడాలని పట్టుపట్టింది. మీ మీ యిష్టమువచ్చినట్లే కానివ్వండి.' అన్నాడు తనకేమీ సంబంధములేనట్టు.

'అయ్యో ఈశ్వరా! ప్రపంచము తల్లక్రిందు లౌతూవుంది. ప్రళయమువస్తూవుంది.'

'ఎందుకూ కాటికి కాలుసాచుకున్న కాలములో సౌకర్యార్థము మనవంటివాళ్లు పెళ్లాడేందుకేనా?' అంది మారమ్మ.

'ఇంతకూ నా పెళ్లి జరగనీవన్నమాట?' సాంబమూర్తికి హృదయము నోటిలోనికి వస్తూవుంది.

'అభ్యంతరమేమి? మొదట వాది. తరువాత మీది.'

'అలాగే కానీయండి. ఒకటేసారి యిద్దరివివాహాలూ కళ్లతో చూచి నా యింతకు నేను వెళ్లుతాను' అన్నాడు శంకరశాస్త్రి.

'మేముకూడా యీ పెళ్లిళ్లు చూడాలనే యింత దూరము వచ్చాము' అన్నారు కొందరుపురాళ్లు.

వెనుకనుండి ఒకపోకరుబోతు 'పిల్లకిపుడు పెళ్లిళ్లట పీళ్ల పిండాకూడు' అని స్పష్టముగా అన్నాడు.

వానిపిపుతడుతూ ఇంకొకడు 'నిజమే భాయీ! తమ్ముగమనించడానికి దిక్కులేదనీ పెళ్లాడాలనీ కోరే యిటువంటివారికి అలాంటి ముసలాళ్లనే—'అని యేమో అంటున్నాడు. పైగా అందరు ముసిముసినవ్వులు నవ్వుకొన్నారు.

బాజాబంత్రీలు ఆగిపోయాయి. సాంబమూర్తికి పెళ్లిసరదా వదలింది సరిగదా ప్రైప్రాణాలు పైననే పోయినట్లు కూలబడ్డాడు. రెండు చేతులతోనూ తల పట్టుకుని. వృద్ధాప్యముచే సరిగానిలవలేని ఆబుజ్జిలో ఏమి ఆలోచనలు పరుపెడుతున్నాయో హృదయములో ఎంత తుపాను చెలరేగుతుందో పైటవాళ్లకు ఏమి తెలుసు.

వున్నట్టుండి సాంబమూర్తి 'ఛీ! నాకీ పెళ్లీ వద్దు సంసారమూ వద్దు, సన్యసిస్తే బాగుంటుంది' అన్నాడు నిట్టూర్పులువిడుస్తూ అధోవదనముతో.

'శంకరం! నా వ్యవహారాలుకూడా నువ్వే చూచుకో నాయనా. అన్నగారే అంతత్యాగము చేస్తూవుంటే నాకుమాత్ర మివన్నీ ఎందుకు? నేను అన్నయ్యనే అనుసరిస్తాను' అందిమారమ్మ అందరివైపు దృష్టినిపారించి.

'ఇక భారతదేశము బాగుపడుతుంది' అన్నారు యువకగణమంతా ఏకకంఠముతో.



# కాడ్లివరాయిల్లో వుండే బలము నిచ్చే సహజగుణం స్కాట్సుఎమల్షన్లో 3 రెట్లు అధికంగావుంది

జబ్బువల్ల నీశరీరంలోవుండే బలమూ సత్తువా నశించిపోయినపుడు, తిరిగీ బలం చేకూర్చేందుకు డాక్టర్లు, ఎ.డి. జీవధాతువులతో మంచిశక్తినిచ్చే కాడ్ లివరాయిల్లాంటి వుత్తమమైనబలవర్ధకం, వేరేఏమీచూపించలేరు.




కాని కాడ్ లివరాయిల్ వున్నదున్నట్లే, బలహీనంగా వుండేస్థితిలో చక్కగా జీర్ణించుకోనడం కష్టం. చాలామంది యీస్థితిలో సేవింపచేలేరు. అందుచేతనే స్కాట్సు ఎమల్షను ముఖ్యముగా ఉపయోగమైంది. ప్రత్యేక పద్ధతితో తయారుచేయబడింది కాబట్టి, స్కాట్సు ఎమల్షను కాడ్ లివరాయిల్లోవుండే శక్తినంతా కలిగివుంటుంది; రుచికరంగా వుంటుంది. ప్రతివారూ జీర్ణించుకోవచ్చు. ఇదేకాకుండా, లైమ్, సోడాలందుండే బలమిచ్చే, హైపోఫాస్ఫైట్సు వున్నందువల్ల సాధారణ కాడ్ లివరాయిల్ కంటె మూడు రెట్లధికంగా గుణంఇస్తుందని కనిపెట్టబడింది.

## అడ్డుకొనే శక్తికూడా వృద్ధిజేస్తుంది

స్కాట్సుఎమల్షన్ జబ్బుపడ్డపుడుపోయిన బలం, ఆరోగ్యంచేకూర్చేదే కాకుండా బలహీనంగలినపుడూ చుట్టుప్రక్కల్లో రోగాలువున్నపుడూ పుచ్చుకోవడానికిఉపయోగపడుతుంది. రోగాలని రానివ్వకుండా పోరాడేశక్తి అమితంగా శరీరానికికలగజేస్తుంది. రక్తం వృద్ధి చేయడానికి, నరములకు బలం చేకూర్చడానికి, అన్నివిధాలా శరీరానికి శక్తికలిగించడానికి, స్కాట్సుఎమల్షన్ డాక్టర్లచే అరవైయేళ్లుగా సిఫార్సు చేయబడుతూవుంది.

# SCOTT'S Emulsion

శుద్ధమైన కాడ్ లివరాయిల్ నుండి,

స్కాట్సుఎమల్షను మండీవర్తకులు: ఇంపీరియల్ కెమికలు ఇండస్ట్రీసు (ఇండియా) లిమిటెడ్.

కలకత్తా బొంబాయి, మదరాసు, లాహోరు, రంగూను, కొలంబో, కాన్పూరు, పాట్నా, అహమ్మదాబాదు, కొచ్చిను, క్యాలికట్, విశాఖపట్టణము, కరాచి, అమృతసరము.



# బాలక్రీడలు

శిష్ట్లా దక్షిణామూర్తిశాస్త్రిగారు

(6 వ సంవత్సరము విద్యార్థులకు)

## 1. వెలదాగుడు మూత

[.......... 10 గ ..........]

తల్లి 5 గ

ఈ ఆటకు అథమము 10 బాలురుండవలెను. ప్రక్కపటములో చూపినరీతిగా ఆటస్థలము 10 గ. పొడుగు 5 గ. వెడల్పుగ నుండునట్లు గీయుము. దానిని రెండుసమభాగములు చేయుము. ఒకబాలుని తల్లి యనుపేర ఒకప్రక్క నిలబెట్టుము. రెండవవానిని దొంగయనుపేర మధ్యరేఖపై నిలబెట్టుము. మిగత ఎనిమిదిమందిని రెండవభాగములో నిలబెట్టుము.

ఉపాధ్యాయుడు ఈలవేయగానే రెండవభాగములోని 8 మందిబాలురు తల్లిని తాకుటకై మధ్యగీతను దాటి దొంగనుతప్పుకొని తల్లివద్దకుచేరవలెను. అదేకాలమున దొంగ 8 మందిలో ఎవరినైనా తల్లివద్దకు చేరులోపల తాకవలెను. తాకబడినవాడు దొంగయగును. తరువాత 8 మంది రెండవభాగములోనికి వెళ్లవలెను. దొంగకాబడిన బాలుడు మధ్యగీతపై నిలచి మొదటివానివలె తాకుచుండవలెను. ఇటులనే మరలమరల ఆడించవలెను.

## 2. చోటు మార్పు

ఈ ఆటకు 10 నుండి 30 వరకు బాలు రుండవలెను. ఒక బాలుడు వలయము వెలుపల నిలువవలెను. మిగత బాలురందరు బార ఎడ మెడముగా వలయమున నిలువ వలెను. బాలుర సంఖ్యనుబట్టి వలయముండును.



X బాలురు

ఉపాధ్యాయుడు ఈలవేయ గానే వెలుపలనున్న బాలుడు తన ఎడమచేతి మీదుగా వలయము చుట్టు తిరుగుచూ వలయములో తన కిష్టమగు బాలుని తాకవలెను. వాని చోట తాను నిలువవలెను. తాకబడినవాడు వలయము వెలుపలకు వచ్చి వలయము చుట్టు తిరిగి తన కిష్టమగు బాలుని తాకవలెను. ఇట్లు అందరు బాలురచే నాడించవలెను.


x బాలురు
o చేరవలసినచోట్లు

## 2. చోటు గెలుపు

ఈఆటకు 10 నుండి 30 వరకు బాలురు కావలెను. సంఖ్యనుబట్టి వలయ మేర్పడ నగును. ఒక్కొక్కనిమధ్య చేయి ఎడమకి ఉండవలెను. వానిని బయటకు దీయుము. మిగత బాలురు నిలచిన తావులందు వారి చుట్టు చిన్నసున్నలు గీయుమని చెప్పుము. గీయించుము. ఆ చిన్న వలయములకు చుట్టూ గజము దూరములో నొక పెద్ద వలయము గీయుము.

మొదట ఉపాధ్యాయుడు ఈలవేయగనే బాలురందరు తాము నిలచిన చిన్నవలయములను విడిచి పెద్దవలయమున చేరి ఎడమ చేతి మీదుగా పరుగెత్తుచుండవలెను. వెలు

వల నిలచిన బాలుడుకూడా వారితో కలసి పరుగెత్తవలెను. రెండవతూరి ఈలవేయగానే పరుగెత్తుచుండు బాలురు లోపలనున్న చిన్నవలయములలో ఒక్కొక్కడు ఒక్కొక్కదాని యందు చేరవలెను. చోటుదొరకని బాలుడు ఓడినట్లు ఎంచవలెను. ఇట్లు మరల మరల చెమటపట్టువరకు ఆడించవలెను.

## 4. రంగుల గుర్తించుట

పదిమంది బాలురు వలయాకారముగా నిలువవలెను. ఒకరికొకరికి బార ఎడ ముండవలెను. వలయములో ఊదా, 2 నీలిమందు, 3 తేలికనీలము, 4 ఆకుపచ్చ, 5 పసుపుపచ్చ, 6 నారింజపండురంగు 7 ఎఱుపు, 8 నలుపు, 9 తెలుపురంగులతో తయారు చేసిన అట్టలనుదెచ్చి ప్రతిబాలునిముందు ఒక్కొక్క రంగువంతున నేలపై నుంచుము. ఎదుటనున్న రంగులపేర్లను చెప్పించుము. 10-వ బాలుని ఎదుటమాత్రము రంగుఅట్ట యుండదు. ఈలవేయగానే బాలురు ఎటమప్రక్కకు తిరిగి వలయముపై పరుగెత్తుచుండ వలెను. మరల ఉపాధ్యాయుడు ఈలవేయగానే ఎచ్చటవారచ్చటనే నిలువవలెను. వారి ముందున్న రంగులఅట్టలవైపు చూడవలెను. మొదటిరంగునకును ఈరంగునకును తార తమ్యములను ప్రకృతికాయలు, పండ్లు, పువ్వులతో సరిపోల్చి జవాబులు బాలురవల్ల రాబట్టుము.




× ఆడెడు బాలురు
ఉ. ఉపాధ్యాయుడు

## 5. కుమ్మరిసారె

20 మంది బాలురుండవలెను. రెండు సమానజట్టులుగా విభజించుము. 105 అడుగుల పొడుగుగల వలయమును గీయుము. ఉపాధ్యాయుని కుడి ప్రక్కగా నొక జట్టువానిన్నీ, ఎడమప్రక్కగా రెండవజట్టు బాలురనున్నూ, సమానదూర ముండవలెను.

ఈలవేయగానే ఉపాధ్యాయుని కుడిప్రక్కనున్న జట్టుపెద్ద తన ఎడమ చేతి మీదుగానున్నూ, ఎడమప్రక్కనున్న జట్టుపెద్ద తన కుడిచేతిమీదుగానున్నూ ఏకకాలమున బయలుదేరవలయును. వల

యము చుట్టి తమతమ చోటులందు చేరవలయును. తమప్రక్కనుండు తమ జట్టులోని రెండవ బాలుని వలయము చుట్టుటకు పంపవలెను. ఇట్లు జట్టులోని ఆఖరుబాలునివరకు పరుసక్రమముగా పంపవలెను. ఏజట్టులోని ఆఖరువాడు ముందు తనచోటు జేరునో ఆజట్టు గెలిచినట్లు తెలియజేయుము.

### 6. నదిని దాటు

రెండడుగుల దూరముండునట్లు సమానదూరముగల రెండుగీతలను 5 అడుగుల పొడుగున గీయుము. 10వరకు బాలు రుండవచ్చును. అథమము ఇద్దరైన బాలురు ఉండవలెను. ఒక్కొక్కనే పిలచి వాని రెండు పాదముల నేలపై మోపి ఒకగీతకు కాలివ్రేళ్లు తగులునట్లుగా నిలబెట్టుము. ఈలవేయుము. వెంటనే బాలుని మునివ్రేళ్లమీద బలమునిలిపి రెండవ గీతమీదికి దుముకుమని చెప్పుము. వాడు గీత దాటి ఎంతదూరము వెళ్లినది, మడిమలవద్ద నేలపై గుర్తుపెట్టుము. ఇట్లు ఒక్కొక్కని వంతున అందరు బాలురను పిలిపింపుము. దూకించుము. ఎవరు ఎక్కువదూరము దూకెదరో వానికే గెలుపనిచెప్పుము. ఆటస్థలము ఇసుకప్రదేశము శ్రేష్ఠము.




### 7. నదిమీదుగా నురుకు

ఉపకరణము:—తేపు

రెండుజట్లులను 5 అడుగుల దూరములో నొకరివెనుక నొకరిని నిలబెట్టుము. జట్టుముందు నియమితరేఖ గీయుము. దానికి 10 గజముల దూరములో ఎదురుగా దుముకుచోట నొకగీత గీయు. దానికి 4 అ. దూరములో ఇంకొకగీత గీయుము.




ఈలవేయుగానే జట్టుమొదటిబాలుడు పరుగెత్తుచూ వచ్చి దుముకవలసిన గీతకు వెనుకగా వేళ్లనుంచి ఎగిరి 4 అ. గీతపైగా దూకవలయును. జట్టులో అందరిబాలురచే దూకించవలెను. 4 అ. లోగా దూకినవారికి కొలువనక్కరలేదు. పైగా దూకినవారి కొలతలను కూడవలెను. ఇటులనే రెండవజట్టువారిచేకూడ దూకించుము. ఏజట్టువారి మొత్తందూరము ఎక్కువగునో ఆజట్టునకు విజయము. [ 'ప్రకృతి' ]

## శిశుపోషణ

అక్కలకర్ర (Pellitory) పిల్లలకు రెండవ సంజీవి.

*　*　*

ఎండకాలమున పుట్టిన బిడ్డలు వేడిమి తాళరు.

*　*　*

పుష్టిగా లేకుంటే పిల్లలకు చేపనూనె లోపలికివ్వడము, వంటికి రుద్దడము మామూలు. ఇదే గుణము గసగసాలు నూరి రుద్దినా వెన్న ఉపయోగించినా కనుపడుతుంది. వెన్న వల్ల వంటికి మృదుత్వము, రంగు కూడా వస్తుంది.

*　*　*

ఆటవస్తువులను ఏమారుమూలల్లో దాస్తావుంటారు పిల్లలు. ఒకప్పుడు యీ మారుమూలల్లో ఏ తేలో వుండి కుట్టుంది. అప్పుడు ఆ బాధ తగ్గడానికి వాళ్ళ ఆటవస్తువులలో జే-గచ్చకాయ గంధము తీసి అంటించి నిప్పుతో కాచడము మంచిది.

*　*　*

త్వరగా బోర్లపడే బిడ్డలు త్వరగా నడవరు.

# • పసిపాపలు •

రాముడు (18 నెలల పిల్లవాడు) తోటలోని మొగ్గలు అన్నీ కోసివేసేవాడు. తల్లి పిల్లవానిని చెట్లదగ్గరకు తీసికొనివెళ్లి, ఒక్కొక్క పువ్వును పట్టుకొని వాసనచూచి, ఎంత సువాసనగావుంది అనేది. పిల్లవాడుకూడా అట్లనే చేయడం ఆరంభించాడు. మొగ్గలుకోయడం మానివేశాడు.

*　*　*

సుబ్బడు (2 సం.) ఉరుము ఉరిమినప్పుడల్లా భయపడేవాడు. తల్లి వానిని వీధిలోనికి తీసికొనిపోయి, ఉరుము ఉరమగానే, పైకి చూచి "బూ" "బూ" అని ఉరుమును ఎదిరించినట్లు అనేది. పిల్లవాడుకూడా అట్లుచేయడం మొదలుపెట్టాడు. భయం పోయి, అది ఆట అయింది.

*　*　*

రంగడు (4½ సం.) అగ్గిపుల్లలు గీచిగీచి పారవేసేవాడు. తల్లి చిత్తు కాకితంముక్కలు అగ్గిపుల్లలుఇచ్చి, వాటిని కాల్చివేసి రమ్మని పంపేది. అప్పటినుంచి కాకితపుముక్కలను కాల్చడానికే అగ్గిపుల్లలు కర్చుపెట్టేవాడు, రంగడు.

*　*　*

కాముడు (10 సం.) ఎవరివస్తువు దొరికినా ఎత్తుకొని పోయేవాడు. వానిఉపాధ్యాయుడు తన మనిపర్సు వానికి ఇచ్చి, కొన్ని వస్తువులుకొని, బిల్లులు తెమ్మన్నాడు. పిల్లవాడు ఆప్రకారంచేసి ఉపాధ్యాయునికి బిల్లులుఇచ్చి, మిగిలినడబ్బు లెక్కబెట్టి, అప్పగించబోయినాడు. "నీవు లెక్కలలో గట్టివాడవు. లెక్కపెట్టి అప్పగించనక్కరలేదు" అన్నాడు ఉపాధ్యాయుడు. డబ్బు లెక్కసరిపోయింది. అప్పటినుంచి కాముడు ఎవరివస్తువు ఎత్తుకోలేదు. చాలా నమ్మకస్తుడు అయినాడు.

*　*　*

ముత్తడికి (3 సం) చీకటిఅంటే భయం. తల్లి సంగనితో ఒక చీకటిగదిలో దాగుడుమూతలు ఆడడం ప్రారంభించింది. సంగడు దాగుకొంటే తల్లి కనిపెట్టడం, తల్లి దాగుకొంటే సంగడు కనిపెట్టడం. ముత్తడు మొదట గదిలోకి వచ్చేవాడు కాదు. క్రమక్రమంగా లోపలికివచ్చి తానుకూడా ఆటలో చేరుకున్నాడు. చీకటి భయం పోయింది.

—వాసవి.

# • అమితాహారము •

బిడ్డలకు వ్యాధులు కలుగుటకు కారణము లెన్నియోయున్నను ముఖ్యమైనది అమితాహారము. అమితాహారముచే మలబంధము, మలబంధముచే నితరవ్యాధులు కల్గుచున్నవి. అమితాహార సేవనముచే మలము పేగులయందు ఎక్కువగ చేరుచున్నది. ఎక్కువగ చేరుటచే పేగులు కొంతకాలమునకు తమ మలవిసర్జనాశక్తిని గోల్పోవుచున్నవి. సరియగు విసర్జనలేని కారణమున మల మొకచోటనుండి అందలి మలినపదార్థములు రక్తప్రవాహమున చేరి రక్తముతోబాటు శరీరమున వ్యాపించి కొంతకాలము గడచినపిదప వ్యాధులు కలిగించుచున్నవి.

మితాహారమువలన బిడ్డలకు నీనష్టములు కలుగవు.

బిడ్డలకిచ్చుఆహారమున శరీరపుష్టికి వృద్ధినిచ్చుగుణములు లేకపోవుటచే సంతుష్టి కలుగగల ఆహారమును తిరుగ కోరెదరు. అజీర్ణమున అసహజమైనఆకలివలనను కోరెదరు. ఇట్టిసమయములందు తఱచుగ ఆహారమివ్వబడుచున్నది. ఇందువలన ప్రయోజనము లేకపోవుటయేకాక అనర్థములు కలుగుచున్నవి. ఆహారమివ్వక యిట్టి సందర్భములయందు నీరు, పండ్లరసములు మొదలగు ద్రవముల నిచ్చుట మంచిది.

వివిధమైనపాకములు బిడ్డలకు మంచివి కావు. అన్నియు భుజించవలయునను ఆశచే మంచివి చెడువి వారు సేవించకుండ జాగ్రత పడవలయును.

భోజనమధ్యకాలములయందు చిరుతిండ్లనిచ్చు అలవాటు అనారోగ్యకరమైనది. అట్టివి బిడ్డలు కోరిన వారిని నీరుత్రాగమనియో లేక విషయమును మరపించుటకై ఆడుకొమ్మనియో కథలుచెప్పియో బుజ్జగింపవలయును.

సకాలమున బిడ్డలకు ఆహార మివ్వవలయును. నమలితిను వాడుకను కలిగింపవలయును. భోజనమునకు నొకగంటకుముందు నీరుత్రాగుట కిచ్చుట మంచిది. (భుజించునపుడు నీరుత్రాగుట చెడుపు. జీర్ణసహాయకారులగు రసములశక్తి నీరు తగ్గించును.) పాలను ఆహారముతో వాడనగును. కాని క్షీరవిరుద్ధములను సేవించునపుడు వాడకూడదు. పాలనుత్రాగుటకు యిష్టపడకుండిన కారణమెఱిగి చికిత్స చేయువలయును.

ముందుభుజించిన లేకఎక్కువగభుజించిన బహూకరింతుమను పోటీలచే అమితఅక్రమ ఆహారసేవనము వీటివలన బాధలు వ్యాధులు కల్గుట కవకాశ మేర్పడుచున్నవి. ఈపోటీలకు అవకాశమివ్వక బిడ్డలకు ఫలాహారముల ప్రత్యేకముగ నిర్ణయించిన శాంతముగ భుజింతురు. పోటీయందు గెలుపొందినవారికి ఆరోగ్యనష్టము, ఓడినవారికి మనోక్లేశము వుండవు. యస్. శేషగిరిరావు

# సౌఖ్యకరమగు

[సంసారము తిన్నగా, సౌఖ్యకరముగా సాగిపోవాలంటే భార్యాభర్తలు తమ బాధ్యతలు తెలిసికొని ఒకరినొకరు సరిగా అర్థముచేసికొని దైనిక జీవితములో సర్వసాధారణముగా కలుగుతూవుండే స్వల్పవిషయాల్లో

## భర్త

1. ఎంతో కష్టపడి పరిశుభ్రముగా మనోహరముగా పెట్టిన యింట్లో తానింట ఉన్నపుడంతా సిగరెట్టు ముక్కలు, వాని బూడిదా వగైరావస్తువులన్నీ, ఇల్లంతా విరజిమ్మి, ఇంట్లో వారికీ, వచ్చేవారికీ మనసు నొప్పి, అసహ్యమూ కలిగించడు.
2. భార్యాభర్తలిద్దరూ ఎక్కడికో బైటపోవాలని తయారుగామున్నా బైలుదేరేటపుడు ఏబొత్తామో, ఏ పౌడుముబుఱ్ఱో మరొకటో కనపడ లేదని చీకాకుపడుతూ అది దొరికేంతవఱకూ అడుగు బైటపెట్టక రాద్ధాంతాలు చేయడు.
3. తన ఉద్యోగాన్నిగురించి, తత్సంబంధమైన వాన్నిగురించీ, సరదాకు మాత్రము భార్యతో మాటాడును కాని అహో రాత్రులు అవూసే ఎత్తుకొని ప్రాణాలు విసిగించడు.
4. ఇంట్లో పనివాళ్లు ఇతరాపనులు చేస్తూ వుండడము తనకు తెలిసీ తాను చెప్పినపనికి వెంటనే పరువెత్తాలని ఆజ్ఞలను జారీజేస్తూ, గోలచేయడు.

## భార్య

1. తనవైపు వారంటే ఎక్కడలేని ఆసక్తి ఆదరమూ కనబరుస్తూ, భర్త బంధువులతో లేనిపోని వాని కన్నింటికీ అయిష్టము చూపెట్టి విసుగుకోదు. అతని స్నేహితులతోను, పనివుండివచ్చిన వారితోనుజగడాలకు తయారుకాదు. వూరికేనే కోపపడదు.
2. దుబారా ఖర్చులుచేసే భర్తను సమయానుకూలముగా మంచిమాటలతో మందలిస్తుంది కాని, కలముకనో, కాగితానికనో, ఖర్చుపెట్టిన చిల్లరడబ్బుల విషయమై పలుమారు ప్రస్తావించి వినుగుకుంటూవుండదు.
3. గృహమన్నివిధాలా భర్తకు సౌకర్యము గలిగించాలని కోరుతుందిగాని అన్నిటికి ఆటంకాలుచెపుతూ, అది పరాయియిల్లు అనే అభిప్రాయం భర్తకు ఎంతమాత్రమూగలిగించదు.
4. పగలంతా పనిచేసి యింట్లో అడుగు పెట్టడముతోటే సంసారములోనివో, తనవో లేక మరేవో కష్టాలన్నీ ఏకరువు పెట్టడానికి ఆరంభించదు.

# సంసారము

సమయానుకూలముగా వర్తిస్తూ నిష్పక్షపాతబుద్ధితో పరిష్కరించుకుంటూ చక్కచేసుకుంటూ రావాలి. ఈవిషయాల్లో సరియైన-ఆదర్శప్రాయులైన భార్యాభర్తలు-ఎలానడుచుకుంటూవుండాలో కొన్నిఉదాహరణాలు.]

## భర్త

5. భార్యకు మెదడనేది వుందనీ,ఉపయోగించేశక్తి సామర్థ్యాలు వున్నాయనీ, తనతోసమానముగాఆదరిస్తాడుకాని తెలివి తక్కువదద్దమ్మఅనిఅనుకోడు.

6. ఉపయోగపడే కార్యమేదైనా చేస్తానని పెళ్లాము సూచించినపుడు అధికారగర్వముతో తృణీకరించకుండా కావలసివస్తే సహాయమూచేస్తాడు.

7. భార్యదినమంతా యింటిలోపడి మగ్గి వుంటుందని విశ్రాంతీ సంతోషమూ కలిగేటట్టు చేస్తాడు లేకపోతే, తానే బైట కెక్కడికైనా తీసుకొని పోతాడు.

8. ఇంటికి బంధువులో స్నేహితులోవచ్చినపుడు పెళ్లాముదుస్తులను అలంకారములనుగూర్చి రిమార్కులు చేయడు.

9. భార్యలో అందరిలోవలె కొన్ని స్వల్ప దోషాలేవోవున్నా సహనము అలవాటు చేసుకుంటాడు.

10. ఆదాయాన్ని గమనించకుండా మితిమీరిన ఖర్చులుచేస్తూ, బిల్లువచ్చినపుడు ఇంట్లో సణుగుతూవుండడు.

## భార్య

5. తాను స్వయముగా చేసికొనదగిన ఇంటి విషయాల్లో భారము ఇతరుల మీద వేయదు. అలాఅనివున్న స్వాతంత్ర్యము దుర్వినియోగము చేయదు.

6. డబ్బు వ్యయముచేయడములో అతి జాగ్రతపడినా దానిని మిగుల్చుకొనడానికని ఒక దినముచేసిన వంటనే దినాలకొద్దీ వుపయోగిస్తూవుండదు.

7. ఇంటిపనుల్లో చెప్పాలని వుండక స్వతంత్రముగా ప్రవర్తిస్తూ అప్పుడు తనబాధ్యతను గుర్తించాలని నేర్పుతో భర్తమనసు కెక్కిస్తుంది.

8. స్త్రీలకు సహజమైనసౌకుమార్యమునకు దూరమైన వేషభాషలను కానీ, పనిపాటలనుకానీ అభిలషించదు.

9. ఏపండుగపబ్బములోగాని, నలుగురతోవున్నపుడుగాని, దుస్తులలోను నడవడికలోను, అతి శ్రద్ధగావుంటుంది.

10. తలవని తలంపుగా తోడుకునివచ్చిన అతిథిని ఆదరణతో గౌరవిస్తుంది. భోజనముకూడా సమకూరుస్తుంది.

# అల్లిక పనులు

ఎ. వి. నరసింహయ్యగారు

### *Snail Trail*



Snail Trail Stitch (స్నెయిల్ ట్రెయిల్ కుట్టు)

పైనకుట్టినదారము అడుగుభాగమునందుండి కుట్టుచున్న దారములో సూదినిపోనిచ్చి, దారమును ఎడమ చేతి బొటనవ్రేలితో అదిమిపట్టి కుట్టుచురావలయును. ఈవిధముగ ముందునిర్ణయించుకొన్నరీతి కుట్టువచ్చును.



కంబళి కుట్టు

ఇది చిన్నదిగను పొడవుగను మచ్చము లేర్పడి డార్నింగ్ కుట్టురీతిగనుండును.



రెండు వరుసలుగా నుండినయెడల అందు పొడవైన వరుసతో వేసికొనుచు రావలయును.



చాటిక కుట్టు

రెండువరుసలు వంకరకుట్టు గలది.

### *Darned Blanket Stitch*



(Darned Blanket Stitch)

(డారండు కంబళికుట్టు)

దీనిని బొత్తాము కుట్టు (Button Stitch) వలెనే ప్రారంభించి మధ్యలో కొంచము స్థలముండునట్లు (పటమున చూపబడిన విధముగ) కుట్టుచు రావలెను. అప్పుడది స్పష్టముగ తెలియును. ఇది కంబళియొక్క బిగువుననుసరించి చాలదగ్గరిగానో, దూరదూరముగానో కుట్టిన బాగుండును.

### *Darning*



(Darning డార్నింగు)

ఈ కుట్టునందు (పటమునందు చూపబడిన రీతి) కుట్లు చిన్నవిగనుండవలెను. వంకర టింకరగాలేక కుట్లు ఒకేవరుసలో నుండవలెను.

## Fly Stitch



Fly Stitch (ఈగకుట్టు)

గుడ్డఅడుగుననుండి కుట్టి పైకివచ్చిన దారమును చాచి అడుగున పెద్దవేలుతో పట్టుకొనవలయును. మరల పటమున చూపినరీతి ఒకకుట్టు ఎత్తుకొనవలయును. రెండుకుట్లు కలియుకీతి కుట్టవలెను. కలియు చోట చిన్నబిందువు కుట్టుతో చేర్చి వేయవలయును.



కంబళీ కుట్టు

ఇది డెయిసీకుట్టును పోలియుండును. పటములో చూపబడినరీతి ఎదురెదురుగా కుట్టవచ్చును. అంచులకు కుట్టునపుడు అర్ధచంద్రాకారముగ వచ్చు కుట్లను మాత్రము కుట్టనగును.

French Knot (ఫ్రెంచి నాట్)

ఎడమచేతిలో దారమును గట్టిగాపట్టుకొని సూదిని ఒకటి లేక రెండుమార్లు దారమునకు చుట్టి

## French Knots




మరల సూదిని ప్రారంభించు చోటనే కుట్టవలయును. దానిని బయటకుదీసి మరియొక కుట్టునకు మొదలిడవల వలయును. (B పటమును చూడుడు.) దారమును సూదిని బయటకు లాగునంతవరకు నుంచవలయును. రెండు మడతలైన దారమును సూదికి మరల చుట్టి ఎత్తవచ్చును. ఈకుట్టును గట్టిగ వేయుచు రావలయును.

## Long and Short Stitch



Long and Short Stitch

(పొడవుగను కురుచగనుయున్న కుట్టు)

ఇది చాటిన్ కుట్టును పోలియుండును. కాని దీని యమరికవలననే కావలసిన తీగలను లతలను కుట్టుకొనవచ్చును. పటమున చూపిన చిత్రమువంటిది కుట్ట దలంచినపుడు పైనగల కుట్టు మొదలుగా పెంచుకొని

తరువాత కొంచము కొంచముగా నిడుపును తగ్గించి ఆకారమునకు సరిపోవురీతి కుట్టుచు రావలెను.

## *Herring-Bone*



(Herring Bone Stitch)
(హీరింగ్ బోన్ కుట్టు)

ఎల్లప్పుడు దారమును సూదియొక్క పైభాగమున నుంచి ఒక చిన్నకుట్టును వేసికొని దారముయొక్క ఎడమప్రక్కనుండి మరల కుడిప్రక్కకు కొనిరావలయును. చేర్చిన హెరింగ్ బోన్ కుట్టునకు మధ్యమున స్థలముండదు.

## *Feathering*



*Feathering* (ఫెదరింగ్ కుట్టు)

బొటనవ్రేలితో దారమున ఈడ్చిపట్టుకొని ఒక వంకరకుట్టు కుడిచేతిప్రక్కగా వేసి సూదిని మధ్యకు తీసికొనిరావలయును. పిదప ఆదారమును అడుగున కుడిచేతిప్రక్క తీసికొని వంకరకుట్టును వేసి దారము యొక్క కుడిప్రక్కగా సూదినిగుచ్చి దారమును లాగుచువచ్చిన పటమున చూపినరీతి కుట్లేర్పడును.

## *Oriental*







Oriental Stitch (ఓరియంటల్ కుట్టు)

(A) పటమునగలరీతి ఒక చిన్నకుట్టును తీసుకొనవలయును. మరల మరియొకప్రక్కకు మరియొక కుట్టును దానికి చేరుగానుండునట్లు కుట్టవలయును. (B) పటమునన్నరీతి కుట్లు దగ్గరగా చేరియుండవలయును.




Finger Cord (ఫింగర్ కార్డు)

ఒక నల్లనిదారమును, తెల్లనిదారమును కలిపి ముడి వేయవలెను. తరువాత ఎ. పటమున చూపినరీతి ఆ ముడిని కుడిచేతి బొటనవ్రేలితోడను, నడిమివ్రేలి తోడను పట్టుకొని చూపుడువ్రేలితో కొక్కెపైచి యెడమచేతితో నల్లనిదారమును కొక్కెవేసి తెల్లని

దారపు కొక్కెలోనికి దీసికొనిరావలయును. (బి. పటమును చూడుడు) తరువాత ముడిని క్రిందికి లాగుచు ముందువేసియున్న కొక్కెనికూడ లాగవల యును. (సి. పటమును చూడుడు.)




## Fancy Cord (ఫాన్సీకార్డు)

ఇది చేతితో సుందరముగ గట్టిగ అల్లనగు దారము. కావలసిన లావు రంగు ననుసరించి కొన్నిదారముల నొక్కటిగచేర్చి గట్టిగ కట్టవలయును. పటములందు చూపినరీతి వాని నొకచో గట్టియుంచి క్రింద అల్లుటకు వీలుండునట్లు చూచుట మంచిది. ఈ అల్లికను మధ్య భాగమున ప్రారంభించి రెండు వైపులందును, లేక మొదటనే ముడివైచి ప్రారంభించి ఒకవైపునకును అల్లుకొనవచ్చును. చేర్చి ముడివేయబడిన దారముల నుండి రెంటినిదీసి దారములనన్నిటికిని పటమున చూప బడినరీతి గట్టిగ ముడివేయవలెను. (పటము ఎ) ఆ ముడిని వేసిన రెండుదారములను కుడియెడమ చేతు లందు పట్టుకుని బి. పటమున చూపినరీతి మడిచి యొక దాని కొక్కెలో మరొకదాని నిముడ్చుచు బిగించుచు రావలయును. రెండు ప్రక్కలందును ముళ్లు వచ్చు టకు దారముల బిగించురీతి సి. పటమున చూపబడినది. ఈ అల్లిక ముగించునపుడు మొదటచేర్చి బిగించికట్టి యున్న చీలను దీసివేయవలెను.



## Preparing and Finishing of Works

### చట్టమున పనిచేయువిధము

ఆనేకులు అల్లిక-కుట్టు-పనులు చేయుటకు నాలు మూలలుగల చట్టమును ఉపయోగించెదరు. దాని అంచులు గుండ్రముగనో లేక చదరముగనోయుండును. అందులో రెండుప్రక్కలందు ఒక సన్నని దారముతో కుట్టవలసిన గుడ్డను చట్టమునచేర్చి పైచదరమున చూపిన రీతి కుట్టివేయవలయును. ఆచట్టము మరి రెండు ప్రక్కలయందును గుడ్డతో కట్టబడియుండును. ఆగుడ్డ తోచేర్చి కుట్టవలసిన గుడ్డయొక్క మిగిలిన రెండుఅంచు లను కుట్టవలయును. అపుడు 12 అంగుళముల పొడవు నకు పైగా సూదిచే కుట్టుటకు సులభముగానుండును.

పై కనబరచిన చట్టమును రెండు బెంచీలుగాని లేక నాలుకాళ్ల పీటయొక్క మధ్యనుగానియుంచి దాని ప్రక్కన కూర్చొని రెండుచేతులచే సూదిని పైపైపు క్రిందివైపుగ గుచ్చుచు పనిని పూర్తిచేయవలయును. అంతయు ముగిసినపిదప గుడ్డను చట్టమునందుండి ఎత్తి దానికి పిదప పట్టుఅల్లికగాని ఫెదర్ అల్లికగాని వేయవలయును.

కుట్టుము ముగించినపిదప చట్టమునందుండి ఎత్తికొని దానిని ఒక కంబళికిని రెంబిలేక గుడ్డకును మధ్యనుంచి ముడతలు లేక, ఒక మేజాపైయుంచి జాగ్రత్తగా యిస్త్రీచేసినయెడల హెచ్చుతగ్గులు లేక ముడతలు కుట్లన్నియు సమముగ వచ్చును.

# పజులు

గతసంచికయందలి పజాలుకు సరియగు సమాధానమొక్కటియు రాలేదు. ఒక తప్పుగల సమాధానముల బంపిన నలుపురికి మూడుమాసములవఱకు గృహలక్ష్మి సంచిక ఉచితముగా పంపబడును.

1. శ్రీమతి పి. సరోజినీదేవిగారు,
c/o డా. పి. విశ్వనాథముగారు,
విజయనగరము సిటీ.

2. శ్రీమతి అనసూయాదేవిగారు,
c/o రావూరి వేంకటేశ్వర్లుగారు,
వేటపాలెం, బాపట్ల తాలూకా.

3. శ్రీమతి ఎం. వేదవల్లితాయారమ్మగారు,
'ఉభయభాషాప్రవీణ',
కొవ్వూరు, పశ్చిమ గోదావరి.

4. శ్రీమతి రాపర్ల రుక్మిణమ్మగారు,
c/o రాపర్ల సూర్యనారాయణగారు,
హెడ్మాస్టరు, మునిసిపల్ ఎలిమెంటరీ
స్కూలు, చిలకలపూడి, మచిలీపట్టం.

క్రింద చూపబడిన పజాలును పూర్తిచేసి మావద్దసీలు చేయబడియున్న జవాబుతో సరిపోవునట్లుగ సరియైన సమాధానమును ఆగస్టు 15వ తేదికి లోపల పంపినవారికి ఒక సంవత్సరము గృహలక్ష్మి సంచిక ఉచితముగా పంపబడును. స్త్రీలుమాత్ర మిందు పాల్గొనవగును. ఒకరొక రన్నేని జవాబులను పంపవచ్చును. జవాబులన్నియు గృహలక్ష్మి కూపనులందే యుండవలయును. ప్రవేశరుసుము లేదు. సంపాదకుల తీర్మానమే అంత్యముగా పరిగణింపబడును. ఫలితములు సెప్టెంబరుమాసపు సంచికలో ప్రచురింపబడును.

అడ్డము

1. ధాన్యము రవాణాచేయుట కెక్కువగా నుపయోగింపబడునది.
3. తీరము.
5. పెక్కుచట్టములకు నే డిది అవశ్యకము.
6. మేకులు.
9. కాపువారి పట్టపుపేరు.
10. చోటు.
11. (త్రిప్పి) పర్వతము.

నిలువు

1. ఒకజాతి మొక్క.
2. దశావతారములలో నొకరి యాయుధము.
3. పన్ను.
4. నేటిప్రపంచమున దీనిభయ మెక్కుడుగగలదు.
7. మార్గము.
8. బుద్ధి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | 4 |
| | ■ | 5 | | | |
| ■ | 6 | ల | | ■ | |
| 7 | ■ | | ■ | 8 | ■ |
| 9 ర | | ■ | 10 | న | |
| 11 | | | ■ | | ■ |

పేరు..........................

చిరునామా......................

..........................

గృ. ల. 5.

# శుచీంద్ర దేవాలయము

స. శ్రీ.

వారణాసి స్థలవిశేషమునకును, కన్యాకుమారి తీర్థవిశేషమునకును వన్నెకెక్కిన విధమున శుచీంద్ర దేవాలయము మూర్తి విశేషమున (Powerful Deity) మన దేశమున ప్రసిద్ధికెక్కినది. ఆ మహోన్నతమైన దేవళమునుదర్శించిన ప్రతియాత్రికుడును ఆ దేవుని పూర్వగాథను దెలుపుచు గోపురముపొడవునను జీవకళలుట్టిపడు చిత్రములనుగాంచి ప్రాచీన శిల్పకళానైపుణ్యమున కచ్చెరువొంది వేనోళ్ళ కొనియాడును. యాత్రికులందరకు నచటి వృత్తాంతము దెలుపుటకును, యందలి చిత్రములను వరుసగా చూపుటకును నొక మళయాళ సేవకుడు ఎల్లపుడు నచట వేచియుండును. ప్రతిదినము దేవతార్చన మున్నగుక్రియ లొకేపూజారిచే జరుపబడవు. మరియు రాత్రులందు దేవేంద్రుడు శుచీంద్రాలయమునకువచ్చి పూజగావించి పోవుచుండునని మూలవిగ్రహమున నలంకారముల మార్పులనుబట్టి నమ్ముచుందురు.

ఆలయము క్రిందభాగము చూచిన తర్వాత అచటిసేవకుడు యాత్రికులనొక చీకటివసారాగుండా పెద్దతలుపువద్దకు గొనిపోవును. బీగములుతీసి యా తలుపు తెరచి వారిని ఇరుకైన మెట్లపైనడిపించుచు రేచీకటిగానున్న పెద్దగదిలోనికి చేర్చును. ఆగదికిరుప్రక్కలనున్న రెండుద్వారములను నాతడు తెరువగనే అచటనుండు చిత్రములు కనబడును. ఒక్కొక్కచిత్రమునే వర్ణించుచు నాతడు యాత్రికులకు తెలియువిధమున నెమ్మదిగ బోధించుచుండును.

మొట్టమొదటి చిత్రమున జ్ఞానారణ్యమను నొకఅడవియందు అత్రిమహర్షియు నాతనిభార్య అనసూయయు నొకకుటీరమున నివసించుచుందురు. రెండవచిత్రమునందు ఆ అడవియందు వర్షములు లేనందున వృక్షములెండిపోయి యుండుటయు, జంతువులు, పక్షులు చచ్చిపడియుండుటయు గానబడును. అత్రిమహర్షి యాజంతుజాలములకు గల్గు విపత్తునుజూచి చింతించి బ్రహ్మదేవునికై తపస్సు ప్రారంభించెను. మూడవచిత్రమందు బ్రహ్మదేవుడు మహర్షికి ప్రత్యక్షమై వర్షములు కురియకుండుటకు కారణము తెలియదనిచెప్పెను. అంతటమహర్షి విష్ణుదేవుని ప్రార్థించెను. విష్ణువు ప్రత్యక్షమై వర్షములు కఱవైనందులకు కారణము తనకును తెలియకున్నదని పలికెను. వెంటనే అత్రిమహర్షి త్రిమూర్తులను ప్రార్థించినచో కారణము తెలియుటకు సందేహములేదని యట్లుచేసెను. నాల్గవచిత్రమున త్రిమూర్తులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు మహర్షి తపస్సునకు తాళలేక ప్రత్యక్షమగుటయు, వర్షములేకుండుటకు ఇంద్రుడు కారకుడనియు, నాతడు గౌతముడిచ్చిన ఘోరశాపమునకు సిగ్గుపడి హిమవత్పర్వతప్రాంతమున దాగియుండెననియు, నాతడుతప్ప మరెవ్వరును వర్షముల

నారదుడా ముక్కలను వారికిచ్చి తానాకలి గానున్నట్లును, ఆముక్కలను ఉడికించిపెట్టమనియు కోరెను. ఆదేవతాస్త్రీలు నారదుడిచ్చినవి ఇనుపముక్కలని తెలిసికొని నాతని పరిహసించి వాటినివదలి శుభ్రమైనభోజనము పెట్టెదమని పలుక నారదు డంగీకరింపక నాముక్కలనే యుడికించమనెను. వాటిని ఉడికించు టెవరికి సాధ్యముగాదనియు, నట్లు చేసిన నామెకు తాము దాసులమైయుండ గలమనియు చెప్పగా నారదుడు సంతోషించి తిరిగి భూలోకమునకుబోయి నాముక్కలను అనసూయాదేవికిచ్చి వాటిని వండిపెట్టమనెను. అనసూయ వెంటనే వాటిపై తన పవిత్రోదకములజల్లి, వండిపెట్టగా నవి తినగలుగమారెను. నారదుడు పట్టరాని సంతోషమున వాటిని గైకొని స్వర్గలోకమునకుజని త్రిమూర్తులభార్యలకుజూపి "దేవతాస్త్రీలయ్యు మీకు సాధ్యముకాకపోయెను. భూలోకమునగల సామాన్యస్త్రీకంటె మీరు తక్కువయిపోయితిరి. ఇక మిమ్ములనెవరు గౌరవింతు?''రన వారు మిక్కిలి యుక్కజపడి తమ గౌరవము కాపాడమనియు, అనసూయ పాతివ్రత్యము భంగమగుటకు మార్గము తెలుపమనియు నాతనివేడిరి. త్రోవకు వచ్చుచుండిరని లోలోపల నారదుడు పరమానందభరితుడై అనసూయ పాతివ్రత్యము త్రిమూర్తులు భంగపరుపగలరని చెప్పెను. అంత నాస్త్రీలు మువ్వురును త్రిమూర్తులకీ సంగతి తెలిపి తమ గౌరవము కాపాడమనిచెప్పగా వారు భార్యలకు లోబడినవారై అనసూయ పాతివ్రత్యభంగము గావించుటకై భూలోకమునకు జనిరి.

తర్వాత నాసేవకుడు అయిదవయంతస్తునకు గొనిపోవును. కథ మిక్కిలి వినోదముగనుండుట చేతను, నాటకముజూచినట్లు ఎదురుగ రకరకముల రంగులతో చిత్రములు గానబడుట చేతను, యాసేవకుని వచనావిధానము మిక్కిలి చమత్కారముగనుండుటచేతను నిజముగ నాకథ ఇపుడెదురుగ జరుగుచుండెనా యనునట్లు యాత్రికులకు దోచుచుండుటచేతను వారి యానందమునకు మేర యుండదు. యాత్రయన నట్టిదనియే జెప్పవలెను.

ఇచటి చిత్రములందు త్రిమూర్తులు భిక్షకుల వేషములతో అనసూయ గుమ్మమువద్ద నిలిచి యామెను భోజనమునకై వేడుదురు.

రెండవచిత్రమున అనసూయ త్రిమూర్తులను బాలురనుచేసి పాతివ్రత్యము కాపాడుకొనిన కథగలదు.

తరువాత చిత్రమున నారదమహాముని యాత్రోవను బోవుచు అనసూయకుటీరమున బాలకులయేడ్పు విని ద్వారముగుండా తొంగిజూచి అనసూయాదేవి బాలకులనుయ్యాలలో నూపుచు యాడించుట గని దివ్యదృష్టితో నంతయు దెలిసికొని హిమవత్పర్వతప్రాంతమున యజ్ఞమును చేయుచున్న అత్రిమహర్షివద్దకు జని, "మీ రింట లేని సమయమున మీభార్య మువ్వురుశిశువులను కనెను''అనిచెప్పెను. అంత నామహర్షి

కనుమతి నొసంగలేరనియు తెలిపి అంతర్థానమయిరి. ఇట్టి నాల్గుచిత్రములు చూపినతరి యా మళయాళ సేవకుడు యాత్రికులతో నిట్లనును: "ఈ గోపురమునకు ఏడంతస్తులు గలవు. అవన్నియు తిరిగి యందుండు చిత్రములజూచుటకు రెండుగంటలుపట్టును. వీరందులకు సమ్మతించుచో చూపెదను." చిత్రములయందు మాటుండ, వర్ణించునపు డాతని కవిత్వము రసవంతముగ నుండుటచే నే యాత్రికుడును నిరాకరించడు. గోపురారోహణమునకు పూర్వమే తిరుమధురమును సేవించెదరు గాన యాత్రికుల కడుపులు చల్లబడి మరింత చురుకుగానుందురు. పై అంతస్తునగల చిత్రములందు ఇంద్రుడు అహల్యను మోహించుటయు, గౌతముడాతని శపించుటయు గానబడును. తరువాత చిత్రమున ఇంద్రుడు సిగ్గుచే నెవరికిని గానబడక హిమవత్పర్వతప్రాంతమున దాగియుండును. అందుచే తనరాజ్యమందు అల్లకల్లోలము గలుగుచుండెను. భూమివర్షములులేక బాధపడుచుండెను.

పిదప నా సేవకుడు శ్రావ్యనాదముతో పాడుచు మూడవయంతస్తునకు గొనిపోవును. అచట తిరిగి పూర్వగాథ ప్రారంభమగును. మొదటిచిత్రమున అత్రిమహర్షి తనభార్య అనసూయకు చెప్పి భూమిని కాపాడుటకు హిమవత్పర్వతప్రాంతమున గొప్ప యజ్ఞము చేయుటకు బోవుటయు, అనసూయ భర్త వచ్చువరకు తనకేది కావలసినదది జరుగుట కాతని పాదములుకడిగి యా జలము జాగ్రత్తపెట్టుటయు గానబడును. తర్వాత చిత్రమున అత్రిమహర్షి హిమాలయ పర్వతమునచేయు గొప్పయజ్ఞము గానబడును. ఇంద్రుడును, త్రిమూర్తులునుతక్క తక్కిన దేవతలందరును ప్రత్యక్షమైరి. కొంతవడికి ఇంద్రుడును ఆతని తపస్సునకు తాళజాలక ప్రత్యక్షమగును. కాని బ్రహ్మ విష్ణు మహేశ్వరులు స్వర్గలోకమునుండి దిగుట కిష్టపడక మహర్షి యాగమును భంగపరచు విధ మాలోచించుచుండిరి. ఆలస్యమయినచో నాతని తపోమహిమచే తాము బోవలసివచ్చుననియు, చవుకగా ఇంద్రునకు శాపవిమోచన గావింపవలసివచ్చుననియు తలచి ఆలోచనకై నారదుని బిలువనంపిరి. పరమసంతోషమున నారదుడు వచ్చి వృత్తాంతము దెలిసికొని అత్రిమహర్షి యాగమును భంగపరచెదనని వాగ్దానముచేసెను. నారదు డాతనియాగము భంగపరచు నుపాయముపన్నుచు ఈసమయముననే త్రిమూర్తులభార్యల గర్వభంగము చేయుటకును, లోకమున పాతివ్రత్యమహిమ యెవరికిగలదో వెల్లడిచేయుటకును నిశ్చయించుకొనెను.

నాల్గవఅంతస్తునగల చిత్రములందు నారదుడు జ్ఞానారణ్యమున అనసూయాదేవి కుటీరమునకు వచ్చి సత్కారముబొంది యామెను ఆశీర్వదించెను. పిమ్మట నారదుడు శనగల ఆకారమున తయారుచేసిన ఇనుప ముక్కలను తీసికొని త్రిమూర్తుల భార్యలను చూచుటకై స్వర్గలోకమునకు జనెను. అచట

ఉగ్రుడై యాగమువదలి విజ్ఞారణ్యమునకు పరుగిడి భార్యను సంగతేమని యడిగెను. అనసూయ భర్త పాదములపై బడి జరిగిన దంతయు జెప్పగా నాతడు దివ్యజ్ఞానముచే నదంతయు త్రిమూర్తుల మోసమని తెలిసికొనెను.

నారదుడు అంత తమభర్తల రాకకై ఆతృతతో నెదురుచూచుచున్న త్రిమూర్తుల భార్యలవద్దకుబోయి తమభర్తలయాశ వదలుకొమ్మనియు, వారు అనసూయాదేవివద్ద శిశువులై యాడుకొనుచుండిరనియు చెప్పెను. ఆస్త్రీలు మువ్వురును త్రిమూర్తులకు గలిగిన యవస్థలకై విలపించుచుండగా జాలిజెంది మీరుమువ్వురును మీయత్తయగు అనసూయవద్దకు జని క్షమించి భర్తలను తిరిగి ప్రసాదింపుమని వేడుకొన్నచో నట్లు జరుగు"నని చెప్పగా వారు నారదునితోడ్కొని భూలోకమునకు జని అనసూయకు మొఱపెట్టుకొనిరి. అనసూయ తన మంత్రోదకముల నాశిశువులపై జల్లెను. అంత నా త్రిమూర్తులు తమ నిజస్వరూపముల దాల్చి, అనసూయపాతివ్రత్య మహిమకు మెచ్చుకొని దంపతు లిరువురను దీవించిరి.

అచట మఠయాళ సేవకుడు పురాణమును కట్టిపెట్టి యా చిత్రమువద్ద సాష్టాంగ దండప్రణామంబు లాచరించి యేమియో కొన్ని మంత్రము లుచ్చరించును.

తర్వాత చిత్రమున సకల దేవతలు, ఋషులు త్రిమూర్తులను ప్రార్థించుట కచటకువచ్చిరి. అందుచే నాప్రదేశము మిక్కిలి పవిత్రమైనదనియు, నచ్చోటునకు శుచీంద్రమని నామమెట్లు గలిగినదియు జెప్పెను.

తర్వాత ఆ సేవకుడు యాత్రికులను కడపటి అంతస్తునకు గొనిపోయి దేవేంద్రుని శాపవిమోచన మెట్లు గలిగినదియు చిత్రముల జూపును. నారదుడు జ్ఞానారణ్యమున త్రిమూర్తులకుగల శక్తిని దేవేంద్రునకు దెలుపుచు వారిని ప్రార్థించుటకు తానుకూడ సహాయుమొనగి శాపవిమోచనమగునట్లు చేసెదనని చెప్పెను. దేవేంద్రుడు తన గురువైన బృహస్పతితోడను, నారదుని సహాయముచేతను కొన్ని సంవత్సరములు బ్రహ్మ విష్ణు మహేశ్వరులకై తపమొనరించెను. తుదకు త్రిమూర్తులు దేవేంద్రుని తపమునకు తృప్తిజెంది ప్రత్యక్షమై నాతనికి వరమిచ్చి అంతర్థానమైరి. కడపటిచిత్రమున దేవతలందరును సహస్ర నేత్రములతో వెలుగొందు దేవేంద్రుని ప్రార్థించుచుచుందురు.

అంత నా కథకుడు యాత్రికులతో వారా దేవళమున జూచు త్రిమూర్తుల విగ్రహము దేవేంద్రునిచే స్థాపించబడినదనియు, తన కా ప్రదేశమున శాపవిమోచన గలిగెను గాన ప్రతిరాత్రియును ఇంద్రలోకము నుండీ స్వయమువచ్చి యావిగ్రహమున కచట పూజాది సత్కారముల గావించి వెడలుచుండుననియు చెప్పును.




## జంతువుల 'జనాభా'కు వాయువిమానాలు

అమెరికాదేశములోని జంతుసముదాయముయొక్క 'జనాభా'ను తీసుకొంటూవున్నారు. ఇందును మనుష్యులసంఖ్య తీసికొనడానికి యెంతప్రయత్నము జరుగుతూవుందో అంత తీవ్రప్రయత్నమును సాగింపబడుతూవుంది. ఈ సంఖ్యావివరములు తెలిసికొనడానికిగాను ప్రత్యేకముగ ఒకశాఖయే యేర్పాటైవుంది. ఇందుకొరకుని పడవలు, మోటార్లు, ఏరోప్లేనులు యెక్కువగా వుపయోగింపబడుతూ వున్నవి. ఇంతవరకు తేలిన లెక్కలు చాల నికరమైనవని ఆశాఖోద్యోగులు అంటూవున్నారు.

గడచిన పండ్రెండుయేండ్లలోను—అంతకు ముందుకన్న యెక్కువ జంతువులు, వేటాడబడినప్పటికిని—యిదివరకు మనకన్న యెక్కువ జంతువులే నేడు ఉన్నట్లు తెలుపుతూవున్నారు. ఆ శాఖవారు అమెరికాలో కొన్ని జంతువులగూర్చిన యీక్రింది అంకెలను ప్రకటిస్తూవున్నారు.

| | |
|---|---|
| ఎలుగుగొడ్లు | 55,000 |
| గ్రిజిల్లీ యెలుగుగొడ్లు | 5270 |
| లేళ్లు | 12,91,300 |
| అడవిమేకలు | 18,500 |
| అడవిగొర్రెలు | 13,000 |

ఈ శాఖవారు అమెరికాలోని యేయే జంతువులసంఖ్య తక్కువఅవుతూ వున్నవీ, యేయేరకముల పక్షులు అంతమౌతూవున్నదీ, వివరములుకూడా ప్రకటిస్తున్నారు.

*　　*　　*　　*

## బీహారులో ఆత్మహత్యలు!

బీహారురాష్ట్రములలో ఒకేవొక ఏడాదిలో 1556 మంది ఆత్మహత్యలుచేసికొన్నారు. బీహారునిరుద్యోగ సంఘ కార్యదర్శి చెప్పిన వివరములబట్టి పైన పేర్కొనిన భయానకవిషయము తెలుస్తూవుంది.

బీహారురాష్ట్రములలో మొత్తముమీద 83, 66, 317 మంది నిరుద్యోగులువున్నారు. వీరిలో నిరుద్యోగులైన విద్యార్థులసంఖ్య 167, 326 బీహారురాష్ట్రముయొక్క మొత్తము జనసంఖ్య 4,18,31,588.

బీహారురాష్ట్రములోని నిరుద్యోగసమస్య అతి తీవ్రముగా వుండడమువల్ల ఆదుర్భరదారిద్ర్యమును భరింపలేక యెందరో యువకులు ఆత్మహత్య చేసికొంటూవున్నారు.

ఒక్క క్రిందటి యేడాదిలో 1556 మంది ఆత్మహత్యచేసికొన్నారంటే యీ నిరుద్యోగ సమస్య యొక్క వొత్తిడి యెంతవరకుందో గ్రహించుకోవచ్చు. ఈ విషయములో ప్రభుత్వముయొక్క బలమైన సహాయము వుంటేనే గాని సమస్యాపరిష్కారమునకు యెటువంటి అవకాశముగాని కానుపించడము లేదనికూడా ఆ సంఘ కార్యదర్శి తెలియజేశాడు. ఈ నిరుద్యోగ సమస్యాపరిష్కారానికి ప్రభుత్వము ఒక ప్రత్యేక శాఖను యేర్పాటు చేయడము యెంతో అవసరంఅంటూ ఆ కార్యదర్శి అభిప్రాయపడుతున్నాడు.

*  *  *  *

## అమ్మాయి ఆకాశమున ఎగిరిపోయింది

కఙ్గ్రా లోయలోని మూఢవిశ్వాసముగల వారికందరికి ఆశ్చర్యమును కలుగజేయునట్టి అద్భుతచర్య జరిగెను.

కఙ్గ్రోటి గ్రామస్థులు 25 మందికిపైగా స్త్రీలు పురుషులు అంతా ఆరుబైట నిద్రించుచుండిరి. అర్ధరాత్రివేళ భోటు అను పేరుగల ఒక స్త్రీ అకస్మాత్తుగా నిద్రనుండిలేచి, తనపిల్లను ఎవరో అపహరించిరని పెద్దకేక పెట్టెను. నిద్రపోవుచున్న స్త్రీ పురుషులందరులేచి చూచుసరికి పిల్లకన్పించలేదు. పిల్ల గాలిలో ఎగిరిపోవుచున్నటుల కన్పించెను. పిల్లతోపాటు దీపముతప్ప మరేమి కన్పించుటలేదు. ఊరివారంతా 300 గజముల దూరమువరకు ఆదీపమును వెంబడించిరి. అక్కడ దీపము ఆరిపోయెను. పిల్ల క్రిందపడెను. పిల్లకు ప్రాణము లేకుండెను. పిల్లతల్లికి పిచ్చిపట్టినట్లయినది. ఎంత ప్రయత్నించినను దారికిరాలేదు.

*  *  *  *

## హాలీవుడ్డులో ఇండియన్ ఫిలుము ప్రయత్నాలు

హిందూదేశాన్నీ హిందువుల నిత్యజీవనాన్నీ తెలుసుకొనుటకు ఫిలుములు తీయడానికి మెట్రో గోల్డ్విన్ మేయరు కంపెనీ డైరక్టరు నాట్యకత్తెలు పెట్టుకునే కర్ణాభరణాలను ఇండియాలో యెన్నోరకాలు కొన్నాడు. ప్రాచీనరథాలు తయారుచేయడానికి నాల్గుచక్రాలున్న యెద్దుబండ్లను కొంటున్నాడు. ఈబండ్లను పెళ్లిళ్లలో వూరేగింపులకు పంజాబులో ఉపయోగిస్తారు. ఇంకా రకరకాల చీరలు, సారెలుకూడా కొంటున్నాడు. వ్యవసాయపు పనిముట్లు, మామూలుగా యిండ్లలో వాడుకునే రోళ్లూ, రోకళ్లూ, తిరగళ్లూ, చేటలూ, బుట్టలూ, తట్టలూకూడా సంపాదించుకుంటున్నాడు. ఈ సంపాదించిన వస్తువులనన్నిటినీ భద్రముగా కట్టి స్టీమరులలో జాగ్రత్తగా పంపదలచుకున్నాడు.

*  *  *  *

## వధువు శతవృద్ధురాలు

పోలెండులో మెద్గవేను అనునామె 107 వ ఏట వివాహముచేసుకొనెను. ఆమె 1827 సంవత్సరము జూను నెలలో జన్మించినది. ఆమెకన్న 70 ఏండ్లు చిన్నవాడైన ఆంటోనీప్రెజా అనునాతనిని వివాహమాడుటకు నిశ్చయించుకొనెను. ఈమెకు ఇప్పటికే ముగ్గురుభర్త లున్నప్పటికీ ప్రెజా తన్ను ప్రేమించినట్లు ఆమె అనుకొనుటచే తానందులకు కంగీకరించెను.

# పుష్పచయము

## ఒకవింత జబ్బు

రష్యన్ నియంత స్టాలిన్‌కు ఒకరకమయిన గుండెజబ్బువుంది. దాన్ని "ఎంజీనా పెక్టారిస్" అంటారుట. ఆ జబ్బుఉన్నవాళ్లంతా వాళ్లనూ వీళ్లనూ యెప్పుడూ బాధపెడుతూవుంటారు. అది ఆజబ్బు స్వభావమట. అందువల్లనే ఆయన రష్యాలో అంతమందిని చంపిస్తున్నాడని డాక్టర్లు అంటున్నారు. ఆజబ్బు స్త్రీవ్యామోహాన్నికూడా కలగజేస్తుందిట.

సోవియెట్ పత్రికవర్కు్‌శాఖలో "స్ట్రొనా" అనే యువతి పనిచేస్తూవుంది. ఆమె మంచి ధార్యమువున్న మనిషి. ఆమెకు మంచి జ్ఞాపకశక్తివుంది. అందుకు స్టాలిన్ మెచ్చుకొని ఆమెను పెళ్లిచేసుకోవలెననుకొంటున్నాడు. ఈ వయస్సులో పెండ్లిచేసుకోవలెనని ఆయనకు బుద్ధిపుట్టడానికికూడా కారణము ఆజబ్బేనట.

## విదేశాలలో పెళ్లిళ్లు

జర్మనీలో సరిపడ్డంత జనసంఖ్య ఉన్నప్పటికీ హిట్లరు ఇంకా వృద్ధిచేసేటందుకు సాధనాలు ఆలోచిస్తూనే ఉన్నాడు. వివాహాలు కానివాళ్లకు ధనమిచ్చి సహాయముచేసి పెళ్లిళ్లు చేయిస్తున్నాడు. వివాహాలు చేసుకోనివాళ్లను దండిస్తున్నాడు. యువతీయువకులకు అన్నివిధములా తగినసహాయము జరిగేటట్లు తన రాజ్యంలో ఏర్పాట్లుచేసి కుటుంబాలు వృద్ధిఅయేమార్గాలు గావించాడు. అందువల్ల వృద్ధిఆయే జనసంఖ్యయే ధనంలాగ చూచుకుంటున్నాడు హిట్లరు.

జపానుదేశంలో యువతీయువకులకు చైనాదేశాన్ని సంపాదించుకోవడానికీన్నీ, ప్రపంచంలోఉన్న అన్నిదేశాలలోకి చవకరకం వస్తువులు తయారుచేయడానికీన్నీ నిరంతరం ఆలోచనలు ఉన్నందువల్ల తగిన వాళ్లను ఎన్నుకుని పెళ్లిళ్లు చేసుకోవడానికి తీరికలేదు. కాబట్టి అక్కడ గవర్నమెంటువారు 'స్లాటుమెషీను' పెళ్లిళ్లు ఏర్పాటుచేశారు. పెళ్లి కావలసిన స్త్రీపురుషులు ఆ మెషీనుదగ్గరకు వెళ్లి ఒకనాణెము దానిలోవేస్తే దానిలోనుంచి పెళ్లికి సిద్ధముగావున్నవారి ఫోటోలు, వారి యోగ్యతలు తెలుపు కార్డు ఒకటి పైకివస్తుంది. ఆకార్డులో ఉండేవాళ్లను ఎంచుకుని వివాహము చేసుకోవచ్చును. ఈలాటి యంత్రాలు రైల్వేస్టేషనుల వద్ద, సినీమాలవద్ద, ఇంకా యితర ముఖ్యమైన చోటులలోను ఏర్పాటుచేశారు. ఈరకంగా వివాహాలు అక్కడ బాగానే సాగుతూఉన్నాయని తెలుస్తూఉంది.

గ్రేటుబ్రిటనులో పెళ్లిళ్లు చేసుకొందుకు స్త్రీలే ముందంజవేయాలని పెద్దల అభిప్రాయం. ఇదివరకు ఇండియాకు అండరు సెక్రటరీ ఆఫ్ స్టేటుగా పనిచేసిన డాక్టరు డ్రమ్మండుషీల్సు లండనులో ఈవిధంగా చెప్పాడు. "Shy men in matters of love need encouragement and women should not be thought unmaidenly for giving them this encouragement." ఈవిధంగాఉంటే జపాను స్లాటుయంత్రంకంటే అనుకూలంగా ఉంటుందంటాడు.

వివాహాల నవీనపద్ధతులలో అగ్రస్థానము గడించినది అమెరికాదేశము. ఈమధ్యనే క్లేరెన్సుస్టోను అను వాతడు మిస్ డోరిస్ ఫెన్‌విక్కు అను ఆమెను వైర్లెస్ ద్వారా ప్రేమించి వివాహము చేసుకున్నాడు. స్టోను వైర్లెసులో పెండ్లికి అంగీకరిస్తావా అని ఫెన్‌విక్కును అడిగాడట. ఆమె వెంటనే "O. K." అని జవాబు చెప్పిందట. ఈవిధంగా పెళ్లిళ్లు నిశ్చయం చేసుకునేటందుకు అమెరికాలో టెలిగ్రాం కంపెనీల వాళ్లు యువతీయువకులకు ఉచితఏర్పాట్లు చేయడానికి సంకల్పించుకుని ప్రోత్సహిస్తూన్నట్లు తెలుస్తోంది.

## ఆరోగ్యపద్ధతులు

నేడు పాఠశాలలందు బాలబాలికలలో అనారోగ్యుల సంఖ్య హెచ్చుగానుండుటకు మన తల్లుల అజాగ్రతయే కారణము. శిశువుయొక్క భావిజీవితమంతయు తల్లిమీదనే ఆధారపడియున్నదనుటకు సందేహము లేదు. శిశుపోషణయందు గలుగు లోపములవలననే బాలబాలికలు మిక్కిలి బలహీనులై సకల వ్యాధులకు బలియగుదురు. కొందరు ధనవ్యయమునకు భయపడి శిశువులను సరియగు పద్ధతులపై పెంచరు. సర్ ట్రూస్‌పార్టరుగారు ఇట్లనిరి : "It is stupid to save a few pounds in the early days of a child's life and then spend thousands later on in providing prisons, work houses and hospitals for the mentally and physically unfit who are victims of early neglect." శిశుపోషణవిషయములో కేవలము తల్లిమీదనే భారమంతయు వదలక తండ్రికూడ బాధ్యతవహించుట శ్రేయస్కరము.

శిశువునకు మనము మాటలాడుట ఎట్లు నేర్పెదమో అట్లే శరీరావయవములు, కండరములు వృద్ధి చేయుటకు (to develop the muscular co-ordination) కూడ ప్రయత్నించవలెను. పసిబిడ్డ కాలుసేతులు మాత్రమే కదలించుచుండును. వాటినైనను కదలింపచేయక మనము ఎత్తుకొనుటకు అలవాటుచేయుటవలన శిశువు ఎదిగినకొలది కాలుసేతులకు పుష్టిఏర్పడక బలహీనత హెచ్చును. అట్లు పెరిగిన శిశువులు అందముగను చురుకుగను ఉండరు. కాన వారిని స్వేచ్ఛగా విడువవలెను. శిశువులకు రకరకముల వస్తువులు చూపుచు వాటిని గ్రహించునట్లు చేయుచుండవలెను. కొన్ని తేలికవి, కొన్ని మెత్తటివి, బరువువి వస్తువులు చేతికి అందిచ్చుచుండుటచే బిడ్డ వాటిని కదలించుచు క్రింద పడవేయుచుండును. మనము తిరిగి వానిచేతుల కందిచ్చుచుండవలెను అట్లుచేయుటచే శిశుకండరములు పుష్టిగా ఎదుగుచు ఆరోగ్యముగనుండును. సాధారణముగా అనేక సైజుల బంతులు ఆటవస్తువులుగ ఉపయోగించుట మంచిది. మిక్కిలి చిన్నవైనయెడల శిశువు మ్రింగివేయును. శిశువులకు రంగులభేదములు తెలియజేయుటకు అన్నిరంగుల ఆటవస్తువులు ఇయ్యవలెను. ఇంకను గుండ్రము, నలుచతురముగల వస్తువులు ఇయ్యవలెను. చిన్నిబల్లలు, కుర్చీపీటలు శిశువులాడుకొనుచోట నుంచినయెడల వాటినెక్కుటకు ప్రయత్నింతురు. మనము జాగ్రతగా సహాయము నిచ్చుచుండినచో ఊహాను, ఆలోచనాశక్తి వృద్ధియగును. శిశువులకు స్పర్శజ్ఞాన మభివృద్ధియగుటకు రబ్బరువస్తువులు, కొన్ని ఘాలుతో చేసినవి, కొన్ని గట్టిపదార్థములు చేతికివ్వవలెను. రకరకముల ధ్వనులు తెలియుటకు సన్ననిశబ్దములనిచ్చు గంటలను ఇవ్వవలెను. కాని శిశువులకిచ్చు గంటలన్నియు చెవి కింపగు ధ్వనులవే లేవలెను. లేనిచో శిశువు వికారమగు శబ్దములకే అలవాటుపడి ముందుముందు శ్రావ్యమగు శబ్దముల వినుట కిష్టపడరు. అందులకే సంగీతము వినుటకైన ఇష్టపడనివారిని వేయిమందికి ఒకనినైన గాంతుము. సన్నని శ్రావ్యనాదములవలన కొన్ని రోగములుకూడ తగ్గునని చాలమంది అభిప్రాయము.

## పుష్పచయము

శిశువునకు కూర్చొనుట కలవాటు పడినప్పటినుండి పెంపుడుజంతువుల పరిచయము చేయుట మంచిది. సాధారణముగా మనయింట పెంచు కుక్కపిల్లలను అలవాటుచేసినచో శిశువు భయమువీడి వాటితో ఆడుకొనుచుండును. అట్టిచో వారికి జీవజంతువులపై ప్రేమయు విశాలహృదయము గలుగుట కవకాశము గలదు. కుక్కలు కొంతమంది వద్దకుచేరవు. కుక్కలుచేరని జనులను నమ్మకూడదని సామెతగూడ గలదు. "Psychological experts seem to prove that there is a transfer from kindness to animals over to kindness to people." ఈ అలవాటువలన శిశువులు తోటివారిని సమదృష్టితో చూచుటకును, అసహనము లేకుండుటకును అవకాశముకలుగును. మరియు శిశువులను ముద్దుపెట్టుకొనుట, గట్టిగా తిట్టుట, లంచములిచ్చుట, కొట్టుట, భయపెట్టుట మొదలగు పనులవలన శిశువుల క్రమమైన, శాంతమైన భావిజీవితము లకు భంగముకలుగునని ఆరోగ్యశాస్త్రవేత్త లభిప్రాయపడుచున్నారు.

### వేసవికాలములో కావలసినదిది

శీతకాలమునందంతయు కొంతమంది వెచ్చని తేనీటి సౌకర్యము ననుభవించుచుందురు. కాని వారే వేసవియందు వేడి తేనీటిని త్రాగుటకు జంకుచుందురు! వారికాసంకోచమెందులకో మన మూహించగలము. వారికీ క్రిందివిషయము తెలియదు. అమితోష్ణముగనుండు దినములలోకూడ వేడి తేనీరు త్రాగినచో భరింపరాని దప్పిని తక్షణము తగ్గించును. దీనికది శ్రేష్ఠమైనది. అంతేగాదు. నీరసముగ, నిస్సత్తువగనున్న పుడుత్సాహము గలిగించుటకు త్రాగదగిన నిరపాయకరమైన పదార్థములలో తేయాకుమొదటిది. ఈ తేయాకుశక్తిని వారు గుర్తింపజాలరైరి. అమితమైన వేడిమిగల దినములలో చల్లదనమునకై మంచుగడ్డతోచేరిన పానీయమును త్రాగుట సాధారణమే. కాని, శరీరములోని వేడిమిని దానికంటె శీఘ్రముగా తగ్గించుటకు తేయాకునకు శక్తిగలదు. మానవుని యాహారపదార్థ విజ్ఞానశాస్త్రమున ప్రవీణులనిపించుకొన్న వారంద రేకగ్రీవముగా నంగీకరించిన విషయమిది; శరీరమునందెక్కువ చెమటను వెడలించుటచేతను, చర్మగ్రంథులనన్నింటిని దెరచి శరీరమునందున్న వేడినంతటిని బైటికి వెడలించుటవలనను, తేనీరు త్రాగిన తరువాత కొన్నిగంటలవరకును చల్లదనమనుభవింపవచ్చును. కాబట్టి వేసవికాలమందు వేడిమిని తగ్గించుటకు శీతలసుఖమనుభవించుటకు వేడి తేనీటిని త్రాగుటయే సరియగు పద్ధతి.

వేసవి దినములలో కష్టపడి పగలంతయు పనిచేసిన తరువాతనో, మనశక్తి సామర్థ్యములన్నియు నుపయోగింపవలసివచ్చు 'షికారి' మొదలగువాని యనంతరమో, ఆయాసము జనించు ప్రయాణము పిమ్మటనో, లేక మరేవిధమగు శారీరక, మానసిక పరిశ్రమచేసిన తరువాతనో, వేడి తేనీటిని త్రాగిన ఎంతచల్లదనము ననుభవించెదవో ఎంతహాయిగనుండువో గమనింపుము.

---

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్ఠయైన మొదటిదినము మొదలు లెక్కపెట్టుకొనవలెను. క్రిందనుదహరించిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1-వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | | | | డిసెంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసెంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 33 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూన్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూన్ |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 23 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగస్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగస్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూన్ |
| సెప్టెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | సెప్టెంబరు |
| జూన్ | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | ఆగస్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగస్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టెంబరు |
| డిసెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసెంబరు |
| సెప్టెంబరు | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 7 | 6 | అక్టోబరు |

# గ్రంథపరిచయము

**శ్రీరమణ మహర్షి చరిత్రము**

అఖిలభారత వాసులకేగాక, ప్రపంచములం దన్నిదిశలనుండి తన మాహాత్మ్యముచే తనవంక కాకర్షించుకొనుచున్న శ్రీరమణ మహర్షులచరిత్ర యెవరికిని నూతనముగాదు, వారి మాహాత్మ్యమునుగూర్చి ఎంతవ్రాసినను చాలదు. ఇది వఱకువ్రాసిన చరిత్రలకంటె ఇది పెద్దది. వారి జీవిత విశేషములు, వారిరచనలు, ప్రముఖులతోటి సంభాషణలు, వారి మాహాత్మ్యమునుజూపు ఘట్టములు వివరముగ గలవు. శ్రీ వారిని గూర్చి తెలియుటకిది యెక్కుడుగ నుపకరించును. కాలికోబైండు 1/16 క్రౌనుసైజున 400 పుటలు, 34 చిత్రములు గలవు. వెల 1-4-0 ప్రతులకు శ్రీ నిరంజనస్వామి, సర్వాధికారి, శ్రీ రమణాశ్రమము, తిరువణ్ణామలై వారికి వ్రాయదగును.

**శ్రీ రమణగీత.**

ఇది 'శ్రీ రమణవిభక్త్యష్టక శ్రీరమణ చత్వారింశత్ గీత మాలా సహితము.' ముముక్షువులుగా భక్తజనులు తన్ను సమీపించి తమతమ సంశయములను దీర్చుకొనుటకై యడిగిన ప్రశ్నలకు ప్రత్యుత్తరములే రమణగీతయని వ్యవహరింపబడుచున్నది. ఇది 1917 వ సంవత్సరమున పూర్తియైనది. తేటతెనుగులో నందరు దానిని గ్రహించుటకు శ్రీయుత గుఱ్ఱము వెంకటసుబ్బయ్యగారు ఎం. ఏ. పద్యములలో ననువదించిరి. అనువాదము సరళమై రచన, సుబోధకమైయున్నది. కాలికోబైండు. వెల 0—8—0

**ఉపదేశ సారము**

ఇది శ్రీ రమణమహర్షిగారిచే తొలుత 'ఉందియార్' అను పేర తమిళమున 30 పద్యములలో వ్రాయబడి తదనంతరము, సంస్కృతమునందు 30 లలితవృత్తగీతములలోను, తెలుగులో ముప్పది ద్విపదలందును, మలయాళమునందు ముప్పది చతుష్పదగీతములుగను రచింపబడినది. ఈపుస్తకమున సంస్కృతశ్లోకములును, వానికిసరియగు ద్విపదలును, సంస్కృతశ్లోకముల ననుసరించి వ్రాయబడిన తాత్పర్యమును గలదు. శ్రీవారిసందేశముల నెఱుగుటకిది మిగుల నుపయోగపడును. వెల 0—6—0

**అరుణాచల స్తుతిపంచకము**

శ్రీ మహర్షులచే రచింపబడిన అరుణాచలసంస్తుతి పద్యములును కీర్తనలును, తెనుగున శ్రీ గిద్దలూరు నరసింగరావు గారిచే చక్కగ ననువదింపబడినవి. వెల 0-2-0

**మహర్షి పాద పద్మసన్నిధిలో**

'A talk with Ramana Maharshi' అను ఇంగ్లీషు మాతృకనుండి శ్రీ కపాలశాస్త్రిగారిచే సంస్కృతమున వ్రాయబడినదానినుండి శ్రీ దామరపాక్కం ఓ. రంగయ్యగారిచే నాంధ్రీకరింపబడెను. ఇందు మహర్షిగారితో సందేహనివర్తక కావింపబడిన సంభాషణ వచనరూపమున గలదు. వెల 0-2-0

**ఉన్నది నలువది**

సద్విద్య, నేనెవడను అనుబంధములు కూడ నిందులోగలవు. 'ఉన్నదినలువది' రమణమహర్షుల నలువది పద్యముల సారాంశము. ఇందు సద్వస్తులక్షణము దానిబొందు నుపాయమును శిష్యవర్గ మపేక్షింప' అసత్యమైన జగజ్జాలమున అంతమొందుచుండమున 'ఉన్నదినలువది'ని సంగ్రహించి శ్రీవారిచే దెలుపబడిన నలువది విషయములుగలవు. తరువాత సద్విద్యయందు ఏది సద్విద్యయగునో వివరింపబడియున్నది. 'నే నెవడను' ఆత్మవిమర్శనము. వెల 0-2-6.

**మహాత్ముని ఆంధ్రదేశ సంచారము**

ఈపుస్తకము పీఠికయందు 'మహాత్ములసందర్శన సంభాషణా సాంగత్యసంసేవనములు పావనములు, తరుణోపాయములు' అని శ్రీయుత కా. నాగేశ్వరరావుగారు వచించినది నిక్కము. సార్థకనాముడైయున్న మహాత్ముడు సంవత్సరములనుండియు నేటివఱకు భారతీయులకు మార్గదర్శకుడై భారతదేశమునకు మోక్షప్రదాతయై యున్నాడు. వారుగావించిన ఖద్దరుయాత్ర, సత్యాగ్రహయాత్ర, హరిజనయాత్ర, ప్రజలందు ధర్మోత్సాహము లమితముగ గానించినవి. ఆసమయమున వారాంధ్రదేశమునకూడ సంచారముచేసిరి. అపుడు వారుదర్శించిన పట్టణములు పల్లెలు, వారు చేకూర్చినధనము, ప్రజలకు ప్రబోధములు, వారియుత్సాహము, మహాత్మునియందు ఆబాలగోపాలమునకు గలభక్తి, వారిత్యాగము, మొదలగు విషయములన్నింటిని పూసగ్రుచ్చినరీతి శ్రీదేశభక్త వెంకటప్పయ్యగారు ఇందు రచించియున్నారు. ఇది కథగాదు, నవలకాదు, నాటకముకాదు కాని చదువరుల నట్టె యాకర్షించుకొని ఆమూలాగ్రముగ చదువ నిచ్ఛ జనింపజేయును. ఇందు మహాత్ములజీవితము క్లుప్తముగ చేర్పబడినది. ఆయాచోటులందు దీయబడిన పెక్కు ఛాయాచిత్రములుకూడ గలవు. 92పుటలు. వెల 0-8-0 దీని నాంధ్రగ్రంథమాలవారు ప్రచురించిరి. ప్రతు లందేగాక ఏలూరు ఆంధ్ర హరిజనసేవాసంఘమునందుకూడ దొరుకును.

**సౌందర్యలహరి శివానందలహరి**

అనువాదకుడు సోమంచి వాసుదేవరావుగారు. ఇవి 'శంకరస్వామి ఘనస్తవములందెందు బోగడొందునవి.' ఆ 'కమనీయకావ్య మధురామృతధారలు భక్తపాలికిన్ బ్రాకటరీతిచెప్ప నులభంబుగఁ గ్రోలగజేయుట' యందే నైర్భర్యముగల యనువాదకుని కవిత సరళతామహితమై ధారాశుద్ధిలో చక్కనినడకల నడచినది. 'జననీ! శారదచంద్రికాధవళమున్ జంద్రస్ఫురన్మౌళియున్......పీయూషమున్', 'ఆనందామృతపూరితంబయి......వాస్తిన్ విడంబించుటన్', మొదలగు పద్యములు మూలమునకు మెఱుగు బెట్టుచున్నవి. కొన్ని పద్యములు సంస్కృత దీర్ఘసమాసభూయిష్టములై యున్నవి. సౌందర్యలహరియందలి 52 వ పద్యమున మూలమునందలి సొంపుచెడినది. మొత్తమున రచన హృదయ రంజకముగనున్నది. వెల శివానందలహరి 0-6-0, సౌందర్యలహరి 0-8-0 ప్రతులు గ్రంథకర్తగారివద్ద తెక్కలిలో దొరుకును.

---

గత సంచికయందలి పజులునకు సమాధానము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రా | స | ము | | డి | బ |
| జీ | | ర | సి | కు | డు |
| | గు | ళి | క | | గు |
| నూ | | | | క | |
| ర | ణ | ము | | వ | డి |
| వ | పీ | న | ము | | గు |

# పత్రికాపరిచయము

## విజ్ఞానం

ఇది రాజమహేంద్రవరమునుండి రెండు నెలల కొకతూరి వెలువడు సంచిక. మొదటిసంచిక జూలై 1937 వ సం॥న వెలువడినది. సంపాదకుడు కళాపట్నపు కొండయ్యగారు ఎం.ఎస్.సి.

జనసామాన్యమున విజ్ఞానము వ్యాపింపజేయు పత్రిక లింతవరకు మన ఆంధ్రదేశమునలేవు. 'సైన్సు' పరీక్షలందు పట్టభద్రులైనవారికి తప్ప మిగిలినవారికి ప్రకృతిశాస్త్ర సామాన్యవిషయములైనను దెలియకున్నవి. స్త్రీపురుషుల దైనికజీవితమున వివిధపదార్థముల భౌతిక రసాయనిక స్వభావములు తెలిసికొనుట అత్యంతావశ్యము. ప్రకృతిశాస్త్రమున వివిధశాఖలనుగూర్చి ఈ సంచికలో తెలుపబడియున్నది. వలయుచోట్ల పాఠకులకు సుబోధకములగునటుల పటములుగలవు. భాషకూడ సులభశైలిలో గలదు. ఇట్టి సంచికలు స్త్రీపురుషులకు రానురాను విదేశములందువలె పరిశ్రమలందాసక్తిగూడ గలుగజేసి మనదేశమున ఆర్థిసమస్యను అచిరకాలమున పరిష్కరింపజేయుట కవకాశము ఉండవచ్చునని మా యభిప్రాయము. సాలుచందా నాలుగు రూపాయలు. విడిప్రతి 0-12-0. జనసామాన్యమునకుగూడ నుపయోగపడుటకును, పత్రిక వ్యాప్తిపొందుటకును చందా, ప్రతివెల, తగ్గించిన మంచిదేమో.

## ఫిలింస్టార్

వి. టి. శ్రీనివాసాచారిగారి సంపాదకత్వమున (163, గోవిందప్పనాయని వీధి, జి. టి. మదరాసు, నుండి) వెలువడు సచిత్రమాసపత్రిక. ప్రత్యేకశాఖలందు కృషిచేయుటకు స్థాపింపబడిన పత్రికలు తెలుగున లేవు. అందుచే ప్రత్యేకపరిశ్రమల నభివృద్ధిచేయు తలంపుతో వెలువడుచున్న నిట్టి పత్రిక లెక్కువ నుపయోగకరముగనుండగలవు. ఇందు తెలుగున తయారగుచున్న పలు చిత్రములందలి దోషములను పవరణలను సూచించు విమర్శనలు, కథలు, వార్తలు, టెక్నిక్కు కు సంబంధించిన వ్యాసములుగలవు. విడిప్రతి 0-1-0.

## మద్యపాననిరోధక పత్రిక

హైదరాబాదు మద్యపాననిరోధకసంఘ యాజమాన్యమున వెలువడు మాసపత్రిక. హైదరాబాదు సంస్థానమున మద్యపాననిరోధమునకై సంఘము కృషిచేయుచుండుట మోదావహము. ఇందులోని వ్యాసములన్నియు వెల్దుర్తి మాణిక్యరావుగారిచే రచింపబడినవి.

మద్యపానము బీదసాదలందును, సంస్కరణవిహీనులైన అంత్యవర్ణజాలందును నెక్కువ. వారి జ్ఞాననేత్రమును దెరపింప నిట్టిపత్రిక లావశ్యకమైనను, ఈ ధోరణిలో నేమియు సేవచేయజాలవు. ఇట్టిపత్రికలింకను చౌకగనుండవలెను. తుదకు ఉచితముగ పంచిపెట్టబడిన మరింత మంచిది. జనసామాన్యము వాడుకొను భాషలో వ్యాసములుండుట యుచితము. ఈ సంఘమువారీ విషయముల గమనించిరేని తమ ఉద్దేశ్యము నెరవేరగలదని మా ఆశయము. సాలుచందా రు. 2-4-0.




పదవీస్వీకారము:—

'రాజెట్టి తప్పును చేయఁజాలఁడు; ఆవిధముగనే కాంగ్రెసు వర్కింగ్ కమిటీ లోపములో కూడిన యేనిర్ణయమునుఁ గావింపఁజాలదు' అనిన జవహరిలాల్ నెహ్రూగారి యాశయము ననుసరించియే కాంగ్రెసు మంత్రిపదవుల నంగీకరించినది. ఈ తీర్మానము నత్యాతురతతోఁ గాచియున్న స్వదేశీయులును విదేశీయులునుఁగూడ తమసంతోషమును వెల్లడించిరి. దీనికందరును తృప్తిని గనఁబరచుచున్నారు. మంత్రిపదవులను చేపట్టుటవలనఁ [illegible]

ములందు కాంగ్రెసు నాయకులు మంత్రివర్గమును చతురతతో నిర్మించినారు. సంయుక్తరాష్ట్రపు మంత్రివర్గమునందు శ్రీమతి విజయలక్ష్మీపండిట్ గారినికూడ చేర్చియున్నారు. భారతరాజకీయ చరిత్రయందిది యపూర్వమగుటయగాక దేశస్థులందఱి ప్రశంసకు పాత్రమైనది. శక్తిసామర్థ్యములుండి సిద్ధముగ నుండినేని స్త్రీపురుష వ్యవస్థ లేకుండ వారి కాయాపదవు లిచ్చుటుత్తమము. ఇది వీరు స్పష్టపరచిరి. ఈవిధముగనే మదరాసు రాష్ట్రమునగూడ చేసియుండిన బాగుండెడిది. అని [illegible]

మంత్రిపదవు లంగీకరించినతరువాత కాంగ్రెసువారేమి చేయవలసియున్నదో, మహాత్ములును, అధ్యక్షులును సూచించియే యున్నారు. మహాత్ములు తెలిపినటుల కాంగ్రెసువారు గ్రామోద్ధరణయందు తమ దృష్టి కేంద్రీకరింపవలయును. వారెదుర్కొనవలసిన ప్రబలసమస్యలన్నియు నందే కలవు. గ్రామములందే భారతజాతి పడరానియిడుమల బడుచున్నది. పేదలపాలిటి పెన్నిది యనిపించుకొనుటకై కాంగ్రెసు మంత్రివర్గము యీయవకాశమును పూర్తిగా వినియోగించుకొనునని నమ్ముచున్నాము.

వేరొకచో నూతనశాసనసభలు. సభ్యురాంద్రు అను శీర్షికతో నూతనశాసన సభ్యురాండ్రేమి చేయవలసియున్నదో కొంచెముగ సూచించితిమి. సోదరీమణులు తమ ఇబ్బందులనుగురించి వాని నివారణోపాయమునకై అధికారవర్గమును అర్థించువఱకు ఊరకుండక వారన్నివిధముల నభివృద్ధికివచ్చుటకు తగినసౌకర్యములు గలిగింతురని ఆశించుచున్నాము. అదియునుగాక సభ్యురాంద్రు మహిళాభ్యుదయమున కత్యవసరముగ కావలసినవానిని శాసనములమూలముగా నిర్ణయింప కోరినపుడును వారికితగు సాహాయ్య మాచరింపవలయును.

* * *

విద్యార్థిలోకమున కిది తగదు:—

ఇటీవల విజయనగరమునుండి వచ్చిన సంస్కృత కళాశాలనుగూర్చిన వార్తలు నే డాంధ్రదేశమున కేగాక యావద్భారతదేశమునకుగూడ నచ్చెరువు కలిగించునవిగాయున్నవి. గుంటూరుజిల్లా అమృతలూరునుండి యొక హరిజనవిద్యార్థి విజయనగర సంస్కృత కళాశాలయందు చదువను ద్దేశ్యముతో నా కళాశాలాధ్యక్షుని దర్శింప వారందఱి విద్యార్థులకువలె నా హరిజనవిద్యార్థికిగూడ నచట యుచిత భోజన మిచ్చుటకు వీలుండదనిరట. ఆ విద్యార్థి యందులకంగీకరించి కళాశాలలో చేర్చుకొన్న హోటలునందు భోజనము చేయుదునని విన్నవించుకొనెనట. అంతట వారు ఎస్టేటు కలెక్టరుగారి యుత్తరువు ప్రకారము హరిజనవిద్యార్థిని కళాశాలయందు చేర్చుకొనిరి. ఇతర విద్యార్థుల కది రుచింపలేదు. అందలి యుపాధ్యాయులు కూడ వారికి ప్రోత్సాహమొసరించియుండవచ్చును. విద్యార్థులందఱు హరిజనుల కళాశాలలో చేర్చకూడదనియు నట్లు గావించిన యితర విద్యార్థులు కళాశాలకు రాజాలరనియు ఎస్టేటు కలెక్టరుగారితో విన్నవించుకొనిరి. కాని దానికి వా రంగీకరింపలేదు. అందుచే విద్యార్థులు సమ్మెకట్టి 40 మంది ఉచితభోజనమునకు రారైరి; 70 మంది కళాశాలకే రాలేదు. అధికారులు వీరికి లొంగక వారిని దండింప నాలోచించుచున్నట్లు తెలియుచున్నది.

దండనాది విషయము లెటులున్నను, హరిజనోద్ధరణమునకై దేశమంతయు ప్రయత్నించుచున్న నీకాలములో భావిభారత

పౌరులు గాబోవు విద్యార్థు లిట్టి సంకుచిత స్వభావులై యుండుట శోచనీయము. మహోన్నతత్యాగముల గావించి మహాత్ములందఱు హరిజనాభివృద్ధిగానిచో దేశమున కెంతేని యరిష్టముగలుగునని పాటు పడుచుండ వారి యడుగుజాడల సంచరించుటకు బదులు, తమతోఁగూడ విద్యాభ్యాసముకూడ చేయుట కనర్హులని హరిజనుల దూరముగనుంచి విద్యార్థులు పుణ్యము గట్టుకొనెదరా? విద్యాభివృద్ధికై ఏమహానీయులో యిట్టి విద్యాసంస్థల నెలకొల్పియుండ అందలి సహాయమునంతయు తాము దప్ప నితరులు పొందకూడదని తమ స్వార్థపరత్వమును ప్రదర్శింతురా?

విజయనగరసంస్కృత కళాశాల విద్యార్థులు తాముచేసినది ఘనకార్యమనియు, నది మత సంఘోద్ధరణ కావశ్యకమనియు దలంచియుందు రేని వారు పొరపడియుందురు. హరిజనులకు తమతోఁకూడ సంస్కృతమును నేర్పించుటలో భాషకపవిత్రతగాని, మతమునకు కళంకముగాని సంఘాభివృద్ధికి లోటుగాని కలుగదు. కాని అవన్నియు రాణించును. భారతమాత దాస్యవిమోచము నేటి ప్రబలసమస్య. అది పరిష్కారము గావలసియున్నచో యువకలోక మొక్కటిగాచేరి కృషి చేయవలసియున్నది. అట్టిదానిపై దృష్టి వీడి నిరుపయోగములై, భేదాభిప్రాయముల కాటపట్టువులైన వానిని బట్టి ప్రాకులాడుచుండుట అభ్యుదయసూచకముగాదు. వారట్టివానిలో జయశీలురును గాజాలరు. విజయనగర సంస్కృత కళాశాల విద్యార్థిబృందమీ విషయమందలి యుక్తాయుక్తములను గమనించి యితర విద్యార్థుల కాదర్శప్రాయముగ వర్తింతురు గాక.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

## ఈశ్వర సం॥ర ఆషాఢ శ్రావణములు

1937 సం॥ ఆగస్టు నెల

1 ద॥ ఆ ఉ7-7దశమి తె4-39 కృసా6-4-5 వఉ7-34 మొ9-4కు భో6-43
2 ఏ॥ సో తె2-9 రోసా5-4 వఉ9-37 మొ12-6 వరా10-19 మొ11-49కు భో6-38
3 ద్వా॥ మం రా11-46 మృసా3.26 వరా10-32 మొ12-2కు భో6-34
4 త్ర॥ బు రా9-33 ఆర్ద్రప 1-57వరా1-12 మొ2-53కు భో6-29
5 చతు॥ గు రా7-37 పునప12-18 వరా8-22 మొ9-52కు భో6-25
6 అమా॥ ● శు సా5-57పుష్య ప11-42 వరా12-10 మొ1-44కు భో6-21
7 శు॥ పా శ సా4-40 ఆశ్లేషప11-4 వరా10-57 మొ12-65కు
8 వి॥ ఆ సా3-48 మఘప20-50 వరా6-56 మొ8-33 భో6-12
9 త॥ సో సా3-24 పుబ్బప11-4 వసా6-30 మొ8-9కు భో6-7 తృ॥తిథి
10 చ॥ మం సా3-32 ఉఫప11-49 వరా8-38 మొ1-19కు మంగళగౌరీవ్రతము భో6-3 చ॥తిథి
11 పం॥ బు సా4-9 హప1-2 వరా9-57 మొ11-20కు భో5-58
12 ష॥ గు సా5-14 చిత్తప2-43 వరా8-51 మొ10-35 భో5-54
13 స॥ శు సా6-46 స్వాసా4-50 వరా10-20 మొ12-6కు భో5-49
14 అ॥ శ రా 8-36విశా రా7-14వ రా11-43 మొ1-59కు భో5-45
15 న॥ ఆ రా10-3 9అనూరా9-52 వతె4-5 మొ భో5-41
16 ద॥ సో రా12-41 జ్యేష్ఠరా12-30 శేవఉ5-51కు భో5-36
17 ఏ॥ మం రా2-34మూ రా2-58వ ఉ9-20 మొ11-6కు వరా1-12 మొ1-58కు భో7-50
18 ద్వా॥ బు తె4-10పూషా తె5-10 వప1-27 మొ3-12కు భో7-46
19 త్ర॥ గు తె5-16 ఉషాపూర్తి వప1-46 మొ3-29కు భో7-42
20 చతు॥ శు పూర్తి ఉషా ఉ6-47 వప11-0 మొ1-12-41కు వరలక్ష్మీవ్రతము భో7-38
21 చతు॥ శ ఉ5-49 శ్రఉ8-3 వప12-11 మొ1-50కు ఉపాకర్మ భో7-34
22 పూర్ణి○ ఆ ఉ6-57పాడ్యమి తె5-35 ధఉ8-26 వసా4-6 మొ5-43కు భో7-30
23 బ॥ ది సో తె4-50 శఉ9-6 వసా3-26 మొ5-1కు భో7-26
24 త॥ మం తె3-33 పూభాఉ8-53 వసా6-15 మొ7-49కు భో7-22
25 చ॥ బు రా1-50 ఉభాఉ8-18 వరా7-48 మొ9-20కు భో7-18
26 పం॥ గు రా11-52 రేఉ7-18 వరా2-17 మొ3-48కు భో7-14
27 ష॥ శు రా9-44 అశ్వ6-2 భరతె4-36 వసా3-6 మొ4-36కు భో7-10
28 స॥ శ రా7-18 కృరా2-59 వసా3-45 మొ5-18కు శ్రీకృష్ణజన్మాష్టమి భో7-6
29 అ॥ ఆ సా4-51 రోరా1-17 వసా6-17 మొ7-46కు వైష్ణవశ్రీకృష్ణ జయంతి భో7-2
30 న॥ సో సా2-24మృ రా11-37 వఉ6-30 మొ7-59కు భో6-58 తిథిద్వయం
31 ద॥ మం ప12-1ఆర్ద్ర రా10-5 వఉ7-30 మొ9-0కు భో6-54 ఏకా॥తిథి

# తులసి, బిల్వ, వేప

ఇవి తులసి, బిల్వ, వేప అను జాతీయమూలికలనుగూర్చి శాస్త్రవిషయకపరిశ్రమచేసి వ్రాయబడిన ఉత్తమ గ్రంథ రాజములు. ఈమూలికల ఓషధిగుణము, వైద్యప్రయోగ ములు, శాస్త్రచర్చ, పురాణవివరము సరళశైలిలో వివరింపబడినవి. వైద్యులకు, భక్తులకు మిక్కిలి ఉపయోగ కరమైన గ్రంథములు. క్రౌనుసైజున మంచి ఫెదరువైటు కాగితముమీద ముద్రింపబడి గృహలక్ష్మి గ్రంథమాలలో ప్రథమ ద్వితీయ తృతీయ కుసుమములుగా ప్రచురింపబడినవి.

గ్రంథకర్త: కే. యన్. కేసరి. ప్రతి 1-కి 0 8-0.

## గృహలక్ష్మి కార్యాలయము,

పోస్టుబాక్సు నెం. 752, ఎగ్మూరు, మద్రాసు.

---

# గృహలక్ష్మి

ఒక్కొక్కవత్సరపు పండ్రెండు సంచికలు కలిపి బైండుచేసిన సంపుటములు. కాలికోబైండు. దిట్టమైనఅట్ట. గ్రంథభాండాగారములకు అలంకారములు. ఒక్కొక్క సంపుటము కొద్ది కాపీలు మాత్రమే ఉన్నవి. కావున త్వరపడి ఆర్డరు చేయవలెను. ఆలసించిన దొరకనేరవు. తిరిగి అచ్చుపడనేరవు.

వెల సంపుటము ఒక్కటికి రు. 6—0—0 మాత్రము

రైల్వేపార్సెలుగా తెప్పించుకొనుట మంచిది.

## గృహలక్ష్మి కార్యాలయము

పోస్టుబాక్సు నెం. 752 ఎగ్మూరు, మద్రాసు.